# విశ్రుతోర్వశీయము

ఇదియొక క్రొత్త నాటకము



కృతికర్త

అభినవ పాణినుశాసన

మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

# విశ్రుతోర్వశీయ నాటకము

కృతికర్త

**బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు**
విశ్రాంతిగొన్న సంస్కృతాంధ్ర భాషోపన్యాసకులు
ఆంధ్రవిశ్వకళాపరిషత్కళాశాల



ప్రథమ ముద్రణము



ప్రకాశకుడు:
**శిరోమణి యరసూరిమల్లికార్జునరావు**
రాజమహేంద్రవరము



వెల. 1—0—0

# ఇందు వచ్చు పాత్రములు

విశ్రుతుఁడు—యాదవరాజు—నాయకుఁడు

శ్రీకంఠుఁడు—తన్మంత్రిపుత్రుఁడు

కిన్నరుఁడు

కణ్వమహర్షి

భార్గవానందుఁడు—ప్రధానమంత్రి

గిరినాథుఁడు

గంగాదాసు

గంధర్వవీరుఁడు

ఊర్వశి—నాయిక

రుచిమతి—చెలికత్తె

కిన్నరి

పతివ్రత—విశ్రుతధర్మపత్ని

మల్లిక—పరిచారిక

ఇందురేఖ—గంధర్వాంగన

వందిమాగధాదులు—



# పీఠిక

శృంగారప్రధానము వీరాద్భుతకరుణాద్యంగము నవరంగము నైన యీ చిన్నినాటకమునం బ్రధాన నాయికానాయకు లూర్వశీవిక్రములు. సూర్యపురాణములోని వీరి పరస్పరానురాగకథ యిందలి ప్రధానేతివృత్తము. ఆధికారికమైన యీవస్తువు దృశ్యకావ్యోచిత మగుట్లకై ప్రాసంగికవస్తు వొకింత యిందుకల్పితమైనది. దానితోం గొన్ని క్రొత్తపాత్రములు నిందుప్రవేశించినవి. అందుచే నిది మిశ్రవృత్తమైనది.

రూపకము వస్తుపాత్రరసపోషణమున సముచితమై ప్రదర్శనరమ్యమయ్యేనేని, యది పూర్వరూపకలక్షణము ననుసరింపకపోయినను హాని లేదన్నభావమును నాయాంధ్రదశరూపక పీఠికలో సూచించియున్నాను. ఇది యట్లు సముచితమో కాదో, అది సహృదయులైన సామాజికులు నిర్ణయింతురు. కాని పూర్వలక్షణము నతిక్రమించి యంకవిష్కంభము లకు బదులుగా నే నిందు రంగముల నేర్పఱచియున్నాను.

ఈకావ్యము నిర్మించి యైదుసంవత్సరము లైనది. ఒకమాఱు ప్రదర్శింపజేసి ప్రకటింత మని చూచితిని గాని, ఆయత్నము కొనసాగ లేదు. దీనిని విన్న రసజ్ఞులు కొందఱిప్రోత్సాహమునను, మన్మిత్రులు శ్రీ అప్పాద్వేదుల సీతారామయ్యగారి (బి. ఏ. యల్. టి) సముత్సాహబలమునను నేఁటి కిది ముద్రిత మైనది. నాటకరసజ్ఞులు దీనిని సాదరముగా నవలోకించుటయే నాకృషికి ఫలము.

ధవళేశ్వరము
11–11–49

మల్లాది సూర్యనారాయణశాస్త్రి

—o—

శ్రీరస్తు

ఓన్నమః పరబ్రహ్మణే

# విక్రమోర్వశీయము

ఉ. ఎవ్వనికోర్కెఁ నీ తెలివి యేర్పడులోకము లుత్పత్తిల్లెనో
యెవ్వనిఁ గాంచఁ గోరినసుధీంద్రులు మానము నాశ్రయించిరో
యెవ్వఁ డనంతరూపముల నెల్లెడ నిండినయట్లు తోఁచి తా
దవ్వయి చూచునో యతనితత్త్వము మీకుఁ బ్రసన్న మయ్యెడున్

మఱియును—

మ. తనుఁ దా నాంతరదృష్టిఁ గన్గొనినయాత్మజ్ఞాని సంసారబం
ధనముక్తిం గని కేవలుం డగుచు నానందించుఁ, దద్యోగసా
ధనసంపత్తికిఁ జిత్తశుద్ధి కుదు, రద్దానిం బ్రసాదించుఁ దా
వనశీలం, బది యిందు నందు సుఖ మాపాదింప వర్ధిల్లుఁడీ!

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు— (తెరవంక చూచి) మారిషా! ఒక్కమా టిటు రమ్ము.

మారి— (ప్రవేశించి) బావా! ఎందుకు రమ్మన్నావు?

సూత్ర— నేఁ డభినయించురూపకము శ్రీమల్లాది సూర్యనారాయణ శాస్త్రిప్రణీత మైనవిక్రమోర్వశీయ మని మనపాత్రవర్గ మెఱిఁగి యున్నది కదా!

మారి— ఎఱుఁగ కేమి? అందఱు తమతమపాత్రములం దవహితులై సిద్ధముగా నున్నారు.

(తెరలో)

గీ. పుణ్యయమునా నదీ తీరభూములందు
వేడ్క విహరించి కన్నులవిందు గాఁగ
సృష్టివైచిత్రి గాంచి వచ్చెద నటంచు
హితుఁడు తా నేగుచుండె విశ్రుతవిభుండు.

సూత్ర— బళీ! మాటలలోనే కథారంభము-మారిషా! వింటివా? విశ్రుతమహారాజు మిత్త్రుఁడైన శ్రీకంఠునితో యమునాతీరవిహారమున కేగుచున్నాఁడఁట. ఇఁక మనపనికి మన మేగుదము.

(ఇరువురు నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన



# విశ్రుతోర్వశీయము

## ప్రథమరంగము — యమునాతీరము

— తెరలో — అశ్వపదధ్వని — పిదప —

గీ. స్వీయ రమణీయ తీర విచిత్రశోభ
గాంచు చేతెంచుచున్న భూకాంతుఁ డతని
హితుఁడు నెక్కినగుఱ్ఱాలగతులు చూచి
యినతనయ నవ్వుకొంచుఁ బర్వెత్తుచుండె.

[గుఱ్ఱములు దిగి వారిరువురు ప్రవేశింతురు]

విశ్రు— (సస్మితముగా) శ్రీకంఠా విన్నావా? మనగుఱ్ఱాలగతులు చూచి యమున నవ్వుకొంచుఁ బర్వెత్తుచుండె నఁట! సెబాసు పరిహాసమైనా సరసమై భావరంజకముగా నున్నది.

శ్రీ— ఎవ రని చూచుచున్నాను.

వి— ఇట్టటు చూతు వెందుకు? పైకి చూడు.

శ్రీ— ఓ నిది ఖేచరోక్తియే (అట్లుచేసి) దాఁటిపోయి యుందురు. పోనిండు. మనయశ్వము లలసిపోయిన వని మనమే యనుకొన్నాము గదా!

వి— ఇక వీటిని విడువవలసినదే.

శ్రీ— అది నిజమే. ఏటితోఁబాటు దారికూడా మెలికలు తిరిగి యున్నది. పైగా మిక్కిలి యిఱుకు.

వి:— అంతేకాదు. ఎదుట నున్నకొండలవరుస చూడు. ఒకదానిని మించి యొకటి యెత్తు. (తేఱి చూచి) ఆహా యే మాపర్వత పంక్తి రామణీయకము!

గీ. తరులతాగుల్మకాంతిసంధానకలన
నంతరము లెల్ల నొకటిగా నతుకుకొనఁగ
నేటవాలుగఁ బెరిగినయొకశిఖరి
కరణి విలసిల్లుచుండె నాగిరులసరణి.

శ్రీ:— ఇక ముందు ప్రయాణము కష్టమే.

వి:— అయితే ఆప్రకృతిసౌందర్యము చూడక పోవడ మేనా?

శ్రీ:— మిాచి త్తము.

వి:— నీవు కూడా అలసిపోయినావా?

శ్రీ:— (చిఱునవ్వు) ప్రభువు ప్రయాసపడు నని... ...

వి:— ఆసహజశోభాసందర్శనమువలనియానందములో కష్టము కంటఁ బడునా? (నిశ్చలదృష్టితో) ఆసౌందర్యదేవత తనమృదుహస్తము లెత్తి యెట్లాహ్వానించుచున్నదో చూడుం.

శ్రీ: (ఆలోకించి) మహారాజా! ఏచిత్రకారుఁ డాసౌందర్యము చిత్రింపఁగలఁడు.

వి:. గీ. నవనవోన్మేషచిత్రవిన్యాసములకు
చూపు నివ్వెఱపడి తేఱి చూచుచుండ
చిత్తమున శాంతిసుఖమును జేర్చునట్టి
సహజసౌందర్యమాల యీశ్వరునిలీల.

మిత్రమా! మనమిక్కడ నిలచుట కాదు. కొంత ముందు కేగిచూతము ఈహాయముల నిచ్చట నుండనీ!

(ఇరువురు నడచుచుందురు)

శ్రీ:— మహారాజా! ఎవరో కొండ దిగి వచ్చుచున్నారు. అరుగో!

వి:— (అటుచూచి) ఔను ఎవరో యోగీంద్రుఁ డనుకొందును. అం

గీ. బక్కచిక్కిన దేహంబు బ్రహ్మతేజ
మెనయుముఖము జటాభారమున కొంకింత
యొరగుశిర మొప్పునిమ్మహాయోగిదర్శ
నంబు మన కొక్కశుభశకునంబుసుమ్మి!

యోగి:— (యథోక్తముగా ప్రవేశించును)

వి. శ్రీ:— (త్రోవప్రక్క నిలచి వంగి నమస్కరింతురు)

యో:— చిరాయు రస్తు, నిరామయో౽స్తు. (నడచుచుండును)

## ప్రథమ రంగము

వి. శ్రీ—(వెంబడి

యో:—(వెనుదిరిగి యాగి) వెనుకకు వచ్చుచున్నా రేమి?

వి—(బద్ధాంజలియై) చిత్తము. తమగమనమున కాటంకము కలుగ రాదు. వేంచేయుచుండుడు. పూజ్యపాదుల ననుసరించి వచ్చుచు మనవిచేయుదును.

యో—ఆఁ! ఇంతలో నేమిటే! చెప్పుము.

వి—స్వామీ: యమునాతీరమున నొకింత విహరించుకోర్కెతో బయలుదేఱి వచ్చితిమి. దైవికముగా మహాత్ముల దర్శనమైనది. మా ప్రయాణము ఫలించినది.

యో—ఓ!! అందు కనవచ్చు గుఱ్ఱములు మీవేనా?

వి—చిత్తము స్వామీ!

యో—ఎవరయ్యా మీరు?

వి—నేను యాదవాన్వయుఁడను. విశ్రుతాహ్వయుఁడను. ఇతఁడు మా మంత్రిపుత్రుఁడు శ్రీకంఠ నామధేయుఁడు.

యో—(సాకూతముగా నవలోకించి) నీవు జయధ్వజుని పౌత్రుఁడవా?

వి—ప్రపౌత్రుఁడను. వీతిహోత్రుని తనయుఁడను.

యో—(సస్మితముగా) మీ ముత్తాతను నే నెఱుఁగుదును. అతఁడు పరశురాముని బారికి తప్పి వచ్చి యిందు కొంతకాలము తపోనిష్ఠ నున్నవాఁడు. అతనివంశ మభివృద్ధిలోనికి వచ్చినది. సంతోషము.

వి. శ్రీ—(సాశ్చర్యానందముగా) పురాణపురుష సందర్శనమున పునీతుల మైతిమి స్వామీ! సహస్రవందనములు.

యో—వంశాభివృద్ధి రస్తు. అయితే కుమారా! ఎక్కడి యదుపురము? ఎక్కడి యమునోత్తర? ఇంతదూరము విహారవినోదమేనా? తీరు విహారము తీర్థయాత్రగా పరిణమించినది.

వి—(సహర్షముగా) యమునోత్తరాతీర్థము సమీపించితిమా?

యో—ఇంకెంత? దాదాపు నాలుగుయోజనములు.

విక్రమోర్వశీయము.

వి.—ఆహా దైవానుకూల్యము!

మో—సత్యము. సర్వము దైవాయత్తము. కాని, సుమారు రేఁ నుడ గుఱ్ఱమెక్కి వెళ్లుట శక్యము కాదు.

వి—పాదచారినై యేగెద.

శ్రీ—(తెల్లబోయి చూచును)

మో—అట్లే కానీ! (మొగము తేఱిచూచి) దైవ మలంఘ్యము కదా!

వి—మహానుగ్రహము—అయితే స్వామీ! ఇంక వియచ్చరులు విహరించుచుందురా!

మో—విహరింప కేమి? అప్సరోగిరిపై నివసింతురు కదా!

వి—అ దెక్కడ స్వామీ?

మో—యమునోత్తరాతీరమున కుత్తరముగా మఱినాలు గామడలో నప్సరస్తీర్థము. దానిదగ్గఱనే అప్సరోగిరి, శ్వేతాగ్రము. కాని, ఆమార్గము దుర్గమముగా నుండును.

వి—మహాత్మా! చాలాసేపు తమయాన మాపినాను. క్షమింపుడు. నమస్కారము.

మో—శుభం భూయాత్ (నిష్క్రమించును)

వి—మిత్రమా! హయరత్నముల నీయడవిని విడుచుట తగదు. అదిగాక మనపరివారము మనకై పరితపించుచుండును. కావున నీ తురగములతో నీవు శిబిరముల కేగి యందలివారితో పురము చేరుము. నే నాతీర్థము సేవించి నెలదినములలో నింటికి వత్తును.

శ్రీ—శ్రీవా రసహాయులుగా… …

వి—అదేమి శ్రీకంఠా! (ఒఱపైఁ జేయివేచి) నా కీఖడ్గమే పరమసహాయ మని యెఱుఁగవా?

శ్రీ—చిత్తము చిత్తము. ప్రభువునాజ్ఞ

వి—సరే కానిమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు)

# విశ్రుతోర్వశీయము

## —◆ ద్వితీయరంగము  యమునోత్తరామార్గము. ◆—

—◆ తెర తొలఁగించుకొని యొకయువతి ప్రవేశించును ◆—

యు—అహా! ఇది యచింతిత సంఘటనమే. ఏక్షణమున కేని యెట్లగునో ముం దెవరి కెఱుక? ఆయోగీంద్రునివంటి త్రికాలజ్ఞులెందే నుందురేమో! వారు కాలస్వరూపులే. (స్మరించి) ఊరక చేసిన నా పరిహాసము వియచ్చరవీక్షణమున కుతూహలము కలిగించినది. యోగీంద్రుని సంభాషణము తీర్థసందర్శనమున నుత్సాహము కల్పించినది. అంతటి మహారాజు మహాసుకుమారుఁడు నిపు డేకాకియు పాదచారియు నయ్యెను. (ఊహించి) కొంతదూరము తోడై చేసినతప్పు దిద్దుకొందునా? బుద్ధిశాలి పరేంగితజ్ఞుఁడు, ఇంతమాత్రము కనిపెట్టఁడా? అయినా సరే, అవసరమైన మాటలుమాత్రము వినఁజేయుచు నామరూపములు ప్రచ్ఛన్నముగా ననుసరించి చూచెద. (ముందు చూచి) అదుగో విశ్రుతమహారాజు. మళుపు తిరిగి త్రోవకు వచ్చెను

—◆ అంత నడచుచున్న విశ్రుతుఁడు ప్రవేశించును ◆—

వి—సాధుదర్శనము సర్వశ్రేయోదాయకము. నా భాగధేయమే యోగీంద్రరూపమున ప్రత్యక్షమైనది.

యు—ఈ యాత్రికు దింపినది.

వి—గీ. కన విధిప్రేరణము లేక మనుజుఁ డెట్టి
పనియు నూహింప నాచరింప వలఁతి గాఁడు,
పౌరుషంబు ఫలించుట భంగపడుట
దైవమునఁ గాదె? పురుషయత్నం బిఁ కేది?

యు — సత్యము మహారాజా!

వి — (తలయెత్తి నల్గడ చూచుచు)

చ. అనుకొననట్టి యాత్ర యిది హాయిగ నల్దెసఁ జిత్రపంక్తి దీ
ప్తినగతి నున్నయీప్రకృతిచిత్రము గాంచుచుఁ బుణ్యతీర్థముం
గనియెద, నంతఁ దాపసులఁ గన్గొని మ్రొక్కెద, నంత వెంశి స్వా
సినయాటులుండు నగ్రములఁ జెన్నగునచ్చరకొండఁ గాంచెదన్

యు — ఆహా! ఏమి చక్కఁదనము? దైవికముగా దివ్యామృతఫలము దృగ్గోచర మైనది. అయితే నేమి? చేతి కందవద్దా?

వి — (ముందు చూచి నడచుచు) అబ్బా! ఇప్పటికి దారి యించుక సుగమముగా నున్నది.

యు — (కొంచెము ప్రక్కకు వచ్చి రాజును చూచుచు)

గీ. అంద మంద మటంచు రేయందము లవి?
అందమున కందమైన యీయందగాఁడు
వీరశృంగారపూర్ణావతారుఁ డౌర!
ఎంతపుణ్యంబు చేసెనో యితనికాంత?

(తేనిఁ గన్నార మరలఁ గాంచి సాకూతసంశయముగా) ధీరుఁడు వీరుఁడు తీర్థయాత్రాపరుఁడు. తొందరపడి తేలిక యగుట గాని యీ సమయమున నీతని హృదయము మెత్తపడునా?

వి — (ఇట్టటు చూచి సహర్షముగా) ప్రకృతిలక్ష్మి నేత్రపర్వముగా దర్శనమిచ్చుటే కాదు, కర్ణరసాయనముగా కలస్వనంబున పలుకరించుచున్నది. (సహర్షముగా) సెబాసు! ఇది నా కుపవనవిహారముగానే యున్నది — యోగీంద్రా! నమస్కారము.

యు — ఇతఁ డప్సరోగిరికి రాక మానఁడు. కాని, ఏమిలాభము? ఈ సుందరునికి తగినసుందరి యెక్కడ సిద్ధము. (చింతించి) కానీ! పదధ్వని వినఁబడనీ !

వి:- (ఇట్టటుచూచి) ఎవరును కనఁబడరే! ఎక్కడిదీయమువ్వలచప్పుడు? (వెనుక తిరిగి) ఏదో చప్పుడా? భ్రాంతి పడితినా? కాదు. కాలి [illegible] —కాని! [నడచును]

యము:- నిశ్శబ్దముగా నడచెద.

వి:— (సహాస్యముగా యమునవంక చూచుచు) ఆహా! కుటిలమయ్యు నకృత్రిమమైనయీ కాళిందిగమన మెంత హృదయంగమముగా నున్నది?

యము:— వెనుక నడచెద—

వి:— చ. ఎదురగు నోరసిల్లుఁ బరుగెత్తుఁ బకాలున నవ్వుఁ దాఁగు వీ
నదరఁగ హోరువెట్టు నదు గంటినయట్లు లణంగు లేచుఁ గ
న్పైదరఁగఁ (దల్లక్రిందగు) విచిత్రవిహార కళిందకన్య, మేల్!

యము:—మన సాపఁ జాలకున్నాను. వినఁబడనీ!

చ. మునుమలరంగ మిమ్ముఁ గని ముచ్చట దాఁగుడుమూఁత లాడెదన్.

వి:— (వెనుతిరిగి) ఎవరు?—నిజమే-ఇది దాఁగుడుమూఁతయే- (నవ్వుచు) వింతలలో నిది యొకవింత—... ... ...

(ఊహించి) ఔనంతే- ఎవరవమ్మా నీవు? మాయశ్వములనడక చూచి నవ్వినదానవా?

యము:— ఇది కోప మనుకోను.

వి:— మాటలాడ వేమి? నిజము చెప్పు-సంశయ మేల?-

యము:— (కలుసుగొంతుతో) ఔనండి. కాని, అది దురభిప్రాయముతోడి పరిహాసముకాదని తమకు విదితమే.

వి:—[సస్మితముగా మొగమాడించుచు] ఇపుడు నానడక చూచి నవ్వవచ్చినావా?

యము:—(మృదుహాసముతో) కాదు మహీకాంతా! క్షమించండి.

వి:—వియచ్చరీ! నీ తెలివికి మెచ్చుకొన్నాను—సరేకాని, నన్ను హసించినా వెందుకు?

యు:—ఏమీ లేదు. మీసుగుణములకు మెచ్చుకొని మిమ్మనుసరించు
చున్నాను.

వి:—(చిఱునవ్వుతో) చక్కఁగా బదులు తీర్చినావు. అయితే, కనఁబడ
రాదా? మాటలాడి వెడలరాదా? ఇదేమిటి?

యు:—నే ననుకొన్నట్లే యున్నది ఘోరణి.

వి:—మాటాడ వేమి? యథార్థకథను, న న్నేల ననుసరించెదవు!

యు:—ఈపలు కెంత తీవ్రముగా నున్నదో! లాభము లేదు.

వి:—పోనీ లే! ఇఁక నన్ను వెంటాడకు. (నడచును)

యు:—భూవరా! మన్నింపుఁడు. నిజము తెల్పెదను.

వి:—(ఆఁగి) అదేదో కానిమ్ము, కాలయాపన చేయక ......

యు:—చ. పురుషులయం దపూర్వ మగుపోడిమి చూడ లభించె నేటికిన్
స్మరకృప, నీరుచిర మొగము చూచినయట్టులు కన్నులార నా
దరమునఁ గ్రోలుచుంటి నిది దక్కుటగా, నిఁక మీమనోరూపముం
దర తగనం చెఱంగియె కనంబడనైతిని పొంగమన్మథా!

వి:—అయ్యో! వియచ్చరీ! మాయలాఁడివనుకొని మందలించినాను;
పొరపాటు. నీసొగసుకేమిగాని, నీయాత్మజ్ఞత కానందించితిని.
మంచిది. ఇఁక నేను పోయివత్తునా? [నడవఁ బోవును]

యు:—మహారాజా!

వి:—[వెనుదిరిగి] ఇంకేమి? నేను దూరము పోవలెను గదా! మాటలతో—

యు:—అందుకే నేను మనవి చేయఁబోవుచున్నాను.

వి:—[నవ్వి] బాగున్నది. దానికి నీమనవి యేమి టమ్మా!

యు:—నాభావ మెఱిఁగించితిని గావున నన్నింక శంకింప రనుకొందును.

వి:—శంకింపను లే! అమ్మనవి కానీ!!

యు:—ముందు మీసౌజన్యమునకు నమస్కారము.

వి:—సంతోషము, కృతజ్ఞుఁడను.

యు:- దయతో నాలకింపుఁడు.

ఉ. గమనాయాసము నోర్వఁజాలునె సుఖాకారంబు మీకాయ? మ
ధ్వము నిమ్నోన్నతశైలసంకులము, తీర్థం బింక మూఁడామడ,లు
ల్లమునం దోఁపఁ దలంప కిం డెడమకేల్, గైకొంచు నాకాశమా
ర్గమునం జేర్తు ముహూర్తమాత్రమునఁ దీర్థక్షేత్రమున్ భూవరా!

వి:—సెబాసు బుద్ధిమతీ! నీసద్భావము వెల్లడించితివి, చాలు. నీవు నన్ననాయాసముగాఁ దీర్థరాజముఁ జేర్చినట్లే యానందించితిని. నీకోరిక మన్నించలే దని సంకోచింపకు. నన్నుఁ బోనిమ్ము.

యు:—అయ్యో! ఈసేవచేసైన నాజన్మము ధన్య మగు ననుకొన్నాను.

వి:—ఏమీ! విచార మేల? ఆసౌశీల్యమే ధన్యతకు మూలము. ఇఁక నీ వుండుము.

యు:—పోనిండు మహారాజా! మన మింతసేపు హృదయపూర్వకముగా సంభాషించుటచే మిత్రుల మైతిమి గదా! దానిని బురస్కరించుకొని వేఱొక్కటి మనవి చేయుచున్నాను. ఇది యైనఁ గా దనక యనుగ్రహింతురుగాక.

చ. విమలమనంబునన్ వినుచు విన్నప మంచుఁ దలంచి, యిట్టిదు
ర్గమగిరిరాజి నొంటరిగఁ గాల్నడకం జనరానిమాట డెం
దమున గణించి, మిత్రు డిగ నాడినదోషము దిద్దుకొంచు, నె
య్యము పచరించు నీసఖి సహాయముగాఁ బయనం బొనర్పుఁడీ!

వి:—నీయాలోచనము సముచితము. నిజముగా నీ వాప్తమిత్రురాలవు లోకములో నిట్టియవ్యాజమైత్రి దుర్లభము. కాని, నే నేకాకినై చనుటకు నిశ్చయించుకొన్నమాట నీవు వినియే యుందువు. దానికింక తిరుగు లేదు. మన్నింపుము.

యు:—(సగౌరవముగా) కానిం డేమిచేయుదును? సజ్జనసాహచర్యమునకు నోఁచుకోలేదు మీవంటిలోకోత్తరుల ననుసరించిన యీముహూ

ర్తము మఱవఁజాలను. పునర్దర్శన మెప్పుడో! (పాదాలు పట్టుకొని కన్నుల కద్దుకొని) నమస్కారము.

వి:—(సంకోచముతో) అయ్యో!! పోనీలే! నిష్కపటమిత్రుడవు! నీకే

యు:—ఎందుకు? అదియును ప్రచ్ఛన్నమే. క్షమింపుము.

(తెరలో—గాండ్రుగాండ్రు—

యు:—మహారాజా! పులి పులి—

వి:—ఏది? ఆఁ రానీ! ఓ! ఇది నరమాంసము చవిచూచినదే. నిశ్శంకముగా చేరవచ్చుచున్నది. ఈమార్గమునకు నేటితో దీనిశిక్ష సరియును.

(తెరలో—గాండ్రు గాండ్రు—

వి:—(కత్తి యెత్తి విసరి) గంతు లణఁగినవా?

యు:—మహాశూరా! జయము జయము. (ఇరువురు నిష్క్రమింతురు)



# విక్రమోర్వశీయము

## —♦ తృతీయ రంగము—అప్సరోగిరి మార్గము ♦—

—♦ సముచితవేషముతోడ విక్రముఁడు నడచుచు ప్రవేశించును. ♦—

వి:— ఇదే అప్సరోగిరి—అట్లే నేమి? దగ్గఱగా కనవచ్చుచు చేరుచున్న కొండదిసి దవ్వగుచున్నట్లున్నది—ఔను. పర్వతస్వభావము బహుచిత్రము.

[తెరలో]

అంతకన్న భూభృత్స్వభావ మనుట సముచితము.

వి: ఓ! వియచ్చరనివాసముచెంతకు వచ్చితినికాఁబోలు! (పైకిచూచి) ఇది సందర్భోచిత మైనభూనాయకనింద. (ఊహించి) ఆగొంతు కాదు— ఖేచరులు ధన్యులు. కామరూపకామగమనముల సర్వదా సవిలాసముగా విహరించుచుందురు.

[తెరలో]

స్వేచ్ఛావిహారమే ధన్యతకు మూలమా?
కామప్రవృత్తుల కది యట్టిదే.
సవిలాసవిహారమున ఖేచరులకు భూచరులు తీసిపోరు.

వి:— అరే! మరల నీమూఁడుగొంతులు వేఱు—ఇది నాఛలోక్తికి విమర్శనము కాఁబోలు!— మరల నేమీ వినరాకున్నది. కాని! (నడచుచు) ఇది యొక చిన్నగుహ. (లోనికి చూచి) శూన్యము—ఆఁ! ఇది యొకగొప్పచప్పరము—ఏనాఁటిదో! నేఁడు నిర్మించినట్లున్నది—ఇది వీథి. రెండుప్రక్కల పొదరిండ్లు. ఇది వియచ్చరుల విహారస్థలము కాఁబోలు! (ఏగుచు) ఏ మీధ్వని!— (చూచి) బళీ! శ్రమ సార్థక మైనది. ఎంతగొప్పధార? ఏనుఁగుతొండములా వున్నది. ఆహా!

గీ. ఎన్నియుగములుగాఁ బడుచున్నయదియొ!
ఎన్నియుగములు మఱి పడ నున్నయదియొ!
ఇమ్మహాధారతత్త్వంబు నేర్పరింప
నెవరితరమౌర! యీశ్వరసృష్టిమహిమ!

(ముందుకు నడచి) ఇది పెద్దగుహ. మిద్దెవలె నున్నది. ఎవరైన సాధువు లుండవచ్చు. (లోనికి తొంగిచూచి) ఒకరెవరో పడుకొని యున్నట్లు కనఁబడుచున్నది. ధ్యానములో నున్నారేమో! పలుకరించిన నపచార మగును.

[గుహలోపలినుండి]— ఛేఛీ!

వి:—సాధువు కాఁడు—ప్రియురాలినికాఁబోలు పిలుచుచున్నాఁడు. (నడవఁ జొచ్చును]

(లోపలినుండి) ఎవ రది? ఉండు. (అనుమాట వినవచ్చును.)

వి:— (వెనుతిరిగి చూచి) ఈవలికి వచ్చుచున్నాఁడు—కిన్నరుఁడు—

కి:— [ప్రవేశించి] ఎవరు నీవు? లోపలి కెందుకు చూచావు?

వి:— యాత్రికుఁడను. ఎవరైనా యోగులు.... ...

కి:— యాత్రికుఁ డేమిటి? ఇల్లు దూఱడ మేమిటి? [అని గద్దించుచు డాసి] ఎవ రంటే చెప్ప వేమి? మనిషి వేనా?

వి:— [కన్ను లెఱ్ఱచేసి] తొందరపడకు జాగ్రత్తగా మాట్లాడు. కారణము చెప్పినాను. [నడవఁబోవును]

కి:—యోగీ! జోగీ! దొంగవేషం. నరుఁడవేనా యంటే బదులు చెప్ప

వి:—ఔను. నరనాథుఁడను.

కి:— ఆఁ! అల్లాగ చెప్పు. స్వయంవరానికి వచ్చినట్లు బాగా వేషం వేసుకొని వచ్చావు లే! ఇక్కడెవరు వరింతు రనుకొన్నావు? ఎవరి కోసం తొంగి చూచావు?

వి:— అన్నా సెలవు ఇప్పు తెలియకుండగా—

కి: ఏమన్నావు? నాయిల్లు దూరికి పైగా [అని చెయ్యి పట్టుకొనును]

వి:— ఓ-హీనుఁడా! అని యీచేయిగట్టిగా నలుపును] ఏమీపోగరు! అణగలేదా?—బుద్ధి వచ్చినదా? ... ... ...

కి:— బాబోయి బాబోయి!— అమ్మో చచ్చాను!—అమ్మో! అమ్మో!

[ బైరలో ]

అమ్మో! ఎవరైనా కొట్టుచున్నారేమో! పట్టపనికిమాలినవాఁ డమ్మో! పతిదినమూ జటిలే కదా!ఎవరో?—అయ్యో! కొట్టకండి వసు స్తను.

వి:— ఎవరో పాప మాఁడది, మొఱ్ఱపెట్టుచు వచ్చుచున్నది.

ఆఁడది— [ప్రవేశించిచూచి] కనికరించి విడిచిపెట్టండి మారాజా!చెయ్యి నెత్తురు చిమ్ముచున్నది.

వి:—[విడిచిపెట్టి]నీపేరేమి?—

ఆఁడ:—సీలవేణి.

వి:—వీఁడు నీప్రియుఁడా?—మంచివానిచెట్టపట్టినావు! [చిఱునవ్వు] వీఁడా నీకు దొరకినాఁడు?

కి:—(చెయ్యి సవరించుకొనుచు కోపముతో] మాటలు బాగా రానీ!

నీ:—చాలుతే సిగ్గు లేక యింకా...ఇంటికి వచ్చినగొప్పవారిని గౌరవించడానికి బదులు దెబ్బలాడుదువా?

కి:—నాచెయ్యి నలిపినందుకు కాళ్లు పట్టి గౌరవించు.

నీ:—నోరు మూసుకో!

వి:—ఛీ! అయోగ్యుఁడు. [నడవఁబోవుచు]

నీ:—అటు దయచేస్తున్నా రెక్కడికి?

కి:—దీని కెందుకో? పోనీయక—

వి:—[నడచుచునే] అప్సరోగిరి చూచుటకు.

నీ:—అందుకే అడిగాను. అటు కాదు. ఇటు వేంచేయండి.

వి:—ఏమీ! ఈమార్గము... ...

నీ:—అది గిరిప్రదక్షిణం చేయడానికి పోయేదారి. మార్గమును—

వి:—అల్లాగా? ఆదారి?—

నీ:—ఇది తిన్నగా కొండమీదికి పోవును.

కి:—విడిచిపెట్టుము కాంబోలునా చెప్పుడా; నా కీవేతిబాధ కూడా వచ్చింది కదా!... ...

నీ:—ఇటు రండి. [అని ముందు నడచును]

వి:—ఇది సుగమముగా నుండునా?

కి:—[కోపముతో] పోతే పోనీ! లోపలికి పోయి చేతికి తగిదుడ్డయినా చుట్టుకొంటాను [నిష్క్రమించును]

నీ:—ఇది మొన్న బాగుచేసిన క్రొత్తదారి, మెత్తగా నుండును.

వి:—నీవు చెప్పకపోయిన నే నాదారిని పోయియుందును.

నీ:—పోనీయండి. తమకు శ్రమ తప్పినది. నాకు మాట దక్కినది.

వి:—సరే, ఇక నీ వుండుము. మంచిదానవు—

నీ:—అతడు తెలివిమాలినవాడు. జరిగినదానికి నేను సిగ్గుపడు చున్నాను. మన్నించి మఱచిపొండు. [నేలకి మొగ్గును]

వి:—సరిలే! నా కాసంకోచమే లేదు. లోకములో మంచితనముకన్న చెడ్డతనమే యెక్కువ. ఇంతకు నీవినయము వానిని కాపాడు చున్నది. అందుకు సంతోషించుచున్నాను.

నీ:—ఈత్రోవనే తిన్నగా వేంచేయండి. నమస్కారము. [నిష్క్రమించును]

వి:—నవ్వుకొనుచు] నేటిప్రయాణము చిత్రముగానే యున్నది—పుణ్యపాపములకలయిక యైనయీజీవసృష్టిలో భూచరులు ఖేచరులు ననెడి వివక్ష కవకాశమే లేదు. ఉత్తమమధ్యమాధమభేద

ముభయసాధారణము. ఇంక విశేష మేమన?—అందఱు నట్టి వారు కారు గాని, వియచ్చరులలో మానవులను నిరసనభావముతో చూచువారెక్కు వనక తప్పదు. తక్కినవిద్య లేవియు లేకపోయినా వియద్గమనవిద్యయే యాదర్పమునకు కారణము—కానీ! ముం దింకేమి యనుభవమునకు వచ్చునో! [నడచుచు] ఓ! ఇది యొకచక్కనివీథి—ఆఁ! ఒకయువతి యిటు వచ్చుచున్నది. [పరికించి] చేతిలోనిది వీణ కాదా?—సందేహ మేమి? రానీ! మంచిశకునమే ... ... ...

యువతి:—[యథోక్తముగా ప్రవేశించి వచ్చుచు ముందు చూచి] ఎవ రీనూతనపురుషుఁడు—వేషమూ రమణీయము—రూపమూ దర్శనీయము ... ... ...

వి:—యువతీమణీ! నా కీస్థలము క్రొత్త—ఒక్కనిమిషము ... ...

యు:—[ఆఁగి] ఏమి కావలెనండీ? ఎక్కడినుండి వచ్చుచున్నారు?

వి:—నీవు గంధర్వకన్యవా?

యు:—(సస్మితముగా) ఔను.

వి:—నీ పేరేమి?

యు:—రుచిమతి—ముందుమీకు కావలసిన దేమో తెలియఁజేయుఁడీ...

వి:—స్వకథన మనుచిత మైనను తప్పదు. నేను యాదవరాజ్యపాలకుఁడను. నాపేరు విశ్రుతుఁడు. అప్సరోగిరి చూడ వచ్చితిని ...

యు:—నివ్వెఱపడి చూచి) మీరు క్షత్రియులా? సంతోషము—మహాపురుషులదర్శనము.

వి:—ఔను. అట్లు చూచుచున్నా వేమి?

యు:—ఏమీ లేదు. మీ రతిసుకుమారులు. కష్టపడి కాలినడక నెందు కీదుర్గమభూమికి వచ్చినా రని ... ...

వి:—అది యొకకుతూహలము ... ఇందు చూడఁ దగినవింత లేమని యడుగుటకే ని న్నాపితిని.

యు:—ప్రకృతిశోభావిశేషమే చూడఁదగినది.

వి:—అంతే కదా! నీవు వీణ చక్కఁగా వాయింతువా?

యు:—ఇపుడు నేర్చుకొనుచున్నాను.

వి:—ఎక్కడ? ఎవరివద్ద? ...

యు:—ఇక్కడనే, ఊర్వశిదగ్గఱ ...

వి:—(సాశ్చర్యముగా) ఏమిటీ! ఊర్వశి? ఆయూర్వశియేనా?

యు:—ఔనండీ! ఈపేరు గలసురలోకసుందరి యింకొకతె లేదు. మీరు విన్నయాప్రసిద్ధ గాయనీమణియే.

వి:—(ఉత్కంఠతో) ఆవిద్వాంసురాలిపాటవినుట గొప్పవిశేషము కాదా?... అదెట్లు?

యు:—సంశయమేమి? రావచ్చు వినవచ్చు. (చిఱునవ్వుతో) అచ్చరల యిండ్లు రాజులయంతఃపురములు కావు.

వి:—(సస్మితముగా) పరిచయము లేదుగదా యని ...

యు:—భూపతుల కట్టిసందేహ ముండునుకాబోలు! నేను పరిచయము కావింతును లెండి— కొండమీఁదికి చూడండి. ఆకనవచ్చు నదే యూర్వశియిల్లు. ఇదే దారి— సాయాహ్నమున మీ రచ్చటికి దయచేయుఁడు. నే నందే యుందును.

వి:—రుచిమతీ! నీసౌశీల్యము ప్రశంసనీయము. సంతోషము.

యు:—మీరు శ్రమపడివచ్చినారు. ఒక్కమూహూర్తము విశ్రమింతురుగాక. తగినగృహము చూపెదను. అక్కడ మీకు సర్వము లభించును. దయచేయుఁడు.

[ఇరువురు నిష్క్రమింతురు]

—o—

# విశ్రుతోర్వశీయము

## చతుర్థరంగము — ఊర్వశియింటిచావడి

—♦ ఉచితాసనములతో మణిదర్పణాదులతో నలంకృతము ♦—

—♦ ఇట్టటు పచారు చేయుచున్నయూర్వశి ప్రవేశించును ♦—

ఊః—ఇందురేఖ అందఱివంటిదిగాను. లేనిమాట పుట్టించదు—ఉన్న మాట దాఁచదు—ఆరాజేంద్రుఁ డీగిరిరాజము చూడ నిశ్చయించుకొన్నమాట నిజమే. కాని యెందు కింకా రాలేదో! దారి తప్పి కొండచుట్టు తిరుగుచుండె ననుకోరాదు. నీలవేణి మొగలో కాచుకొనియే యున్నది. (సోత్కంఠముగా) దర్శన మైనా కాదా? —ఇందురేఖ యే మన్నది?—

గీ. ఎవరు నిన్ను వరించిన నింతదనుకఁ
దనకు నలకూబరుఁడు దక్క ననుచు మురియు
రంభగర్వ మణంగ నారంభ మగునొ !
అమ్మహారాజు మనకొండ కరుగుదెంచు.

తాను నిరాశ చేసుకొనియన్నమాట కాని, యిది ముఖస్తుతి కాదు (దారివంక చూచి) ఆఁ! రుచిమతి వచ్చుచున్నది. దీని కేమైన జాడలు తెలిసె నేమో ! చూతము.

[వీణ చేపట్టిన రుచిమతి ప్రవేశించును]

ఊః—(మందస్మితము)రుచీ రావే! ఎన్నాళ్ళకు కంటఁబడ్డావు?

రు:—(వీణ బల్లపై పెట్టుచు సాకూతస్మితముగా) ఎన్నాళ్ళయితే నేమి? సమయాని కందుకొన్నాను.

ఊః— చు)నే నేమీ కార్యము తలపెట్టలేదే! సమయ మేమిటి?

రం:—ఇది తలపెట్టే సమయమే.

ఊ:—(సధైర్యగాంభీర్యముగా)అబ్బో! భవిష్యత్తు తెలిసినదా? అయినే కానీ!

రం:—నే నిపుడొకమహారాజును, కాదు కాదు—సౌందర్యరాశిని సందర్శించినాను.

ఊ:—అదృష్టవంతురాలవు-ఎవ రమ్మా!

రం:—ఎవ రేమిటి? నేను బయలుదేఱి వచ్చుచు—అదిగో ముందు—

ఊ:—ఆ తడఁబా టేమిటే సరిగా చెప్పక?—

రం:—నీ వెపుడు చెపుదు నన్నయాత్రి మట్లు చేయుచున్నది. ముందదే చెప్పెదనులే!—నే నపుడు పూర్తిగా వినలేను గాని నేనూరికి పోవునాఁడు విన్నమనోహరాంకారుఁడే.

ఊ:—(నవ్వి) సెబాసు! నీ వుపాధ్యాయురాలవుగా నుండవలసినదానవు.

రం:—(నవ్వి) ఉండవమ్మా నవ్వకు—అంతా ఒక్కమాట చెప్పవలెనని యాశ—మాటలు పొసఁగడము లేదు—

ఊ:—తత్తఱపడకు. ఏమి విన్నావు? ఎక్కడ విన్నావు?

రం:—అదంతా పూసగ్రుచ్చినట్లు చెప్ప లేను గాని, మనోరేఖప్రశ్నయు నిందురేఖసమాధానము నొక్కగీతముగా వినిపించెద, విని యూహించుకో!

గీ. అందకత్తెలలోపల నందకత్తె
వైననీ విట్టు లన, మనలోన నతని
వలచి వలపించుకొన నింక వలతి యెవతె?
రంభయొక్కతె—ఊర్వశీరమణియొకతె.

ఊ:—అంత చక్కనివాఁడా?

రం:—నీవు వర్ణింపఁగల వేమోకాని, నాకు వర్ణనాతీతుఁడే.

ఉ. ఆనరనాథుచక్కఁదన మాపరమేష్ఠితలంపు తీర్చెనో!
తా నయి తీరెనో! యెవఁడు దానిరహస్య మెఱుంగు? దద్గుణ
ధ్యానమొ దాసినైజమొ! యథార్థము చెప్పెద నమ్ము మామహీ
జానిని జూచి నేను సుమసాయకుఁడే యనుకొంటి నెచ్చెలీ!

ఊ:—(సహేతుకముగా) ఎక్కడ చూచినావే రుచీ!

రు:— తినఁబోవుచు రుచి నడుగనేల? ఆవిశ్రుతమహారాజు నీపాటవినఁ కోర్కె నిచ్చుటకే వచ్చుచున్నాఁడు. ఇక వీణ సవరించుము.

(విశ్రుతుఁ డొకవంక ప్రవేశించును)

( ఊర్వశీరుచిమతులు వీణలశ్రుతులు సరిచేయుచుందురు )

వి:—(పరిక్రమించుచు) ఊర్వశి యన సాధారణసురకాంత కాదు. ముజ్జగములఁ బ్రశంస కెక్కినది. ఆసుందరి నిందు సందర్శించుట గొప్పవిశేషమే. (ఒక్కఁడు గాఁగి)

చ. అరయ వియచ్చరాంగనలయందు మనోహరకోమలాంగు ల
ప్సరసలు, వారిలోఁ గుసుమసాయకు నివ్వెఱలూర్చు చెల్వపుం
గరిమకు రంభ యూర్వశియుఁ గాఁపుర, మందు నిగర్వభావ మ
చ్చెరువగుపాటనేర్పు మృదుశీలము నూర్వశిసొమ్ము గాదొకో!

( నడచుచు ) ఆహా విచిత్రసంఘటనము! ఔరా అలభ్యయోగము!
(ఆఁగి) ఔను గాని, ఊర్వశిపాట యని యుబలాటపడితే సరా?
అది సురవారసుందరి నెఱజాణ—

గీ. ఆయువతిచక్కఁదనము నేత్రామృతంబు,
ఆవిదుషిపాట కర్ణరసాయనంబు,
ఆసుదతిమాట మానసాహ్లాదనంబు,
నైనయెడ నింక నేను నే నగుదునొక్కొ?

(పరిక్రమించుచు) అయితే యిపుడు కర్తవ్య మేమి? ముందుగా పాట వినుకోరిక చెప్పి పంపితిని గదా! (ఊహించి) ఎంత కీతర్కము!

కానీ! ఇ దెందుకు వచ్చెనో! సర్వము దైవాధీనము (రసికగా నడచుచు) ఇదే యిల్లు, చావడిలో సందడి—

ఊ: —(రాగాలాప మారంభించును)

వి:— (విని) బళీ! యిది సుధారసబిందువా? కలకంఠీకంఠమా!

ఊ: —(దారివంక చూచుచు వాయించుచుండును)

వి:— అరే! ఏ వీణామూర్ఛ్య?

రు: —(నవ్వుచు) ఏవీణారాగ సరణి? కాదు కాదు. ఏమి రాగమహిమ?

ఊ: —ఏ మావేళాకోళము? (సరిగా మోగించును)

వి:— రాగమాలిక కాదు పరాకు గాని,

ఊ: —(స్వరము పలికించుచుండును)

వి:—(సమీపించుచు) వహవా! వీణ కాదు, సరస్వతి పలుకుచున్నది.

ఊ.—(వాయించుచుండును)

వి:—మేలు! రుచిమతీ! నీమేలు మెచ్చుకొంటి.

రు:—(ద్వారమువంక చూచి) అదిగో! విక్రమమహారాజు!

( ఇరువురు లేతురు )

వి:—(లోనికి వచ్చి చూచి) ఆలావణ్యరాశియే యూర్వశి. ఆహా!

ఊ—రు:—(ఎదురేగి) స్వాగతము స్వాగతము. (ఆతిథ్య మాచరించి రత్నాసనము చూపుదురు)

(అందఱు నుపవసింతురు)

వి: —(సస్మితముగా) గాయనీమణీ! కథలలో వినుచున్న నీగానమహాత్మ్యమును నేడు వీనులవిందుగా విన్నాను, ఈభాగ్యము కలిగించిన దీరుచిమతి.

రు:— (చిఱునవ్వు) మిమ్మిచ్చటికి తెచ్చినదైవమే యిందుకును మూలము.

ఊః:—(సవినయముగా) యాదవేంద్రా! తమపాదస్పర్శమున నాసదనమును తమదర్శనమున నాజన్మమును పావనములైనవని నేనానందించుచున్నాను.

వి:—సురసుందరీ! నేను వచ్చినపనికి నేనే యంతరాయము కలిగించితిని. మఱికొంత సేపు నీగానమాధుర్యము కర్ణామృతమగుగాక.

ఊః:—(వీణ పలికించుచు రాగ మెత్తుకొనును)

రు:—(శ్రుతి వేయుచుండును)

వి:—(ఆలకించుచు నానందించుచుండును)

కల్యాణి—ఆదితాళము,

కమలనయన । విమలమానసమునన్ ।
దలంచెదన్ నిన్ । గొలిచెదన్॥ పల్లవి.
పరమపురుషుండవు । పరసుఖవరదుండ
వపారకరుణాభరితుండ వనంగ॥ అనుపల్లవి.
డెంద మురుతరానంద మొంద । నురమందు
పొందువడుసుందరాంగి సిరి । మందహాసి
తములవిందుపసందు । లందుచూపులం
గనందగు నను దయ।
వేద మెఱుంగ! మతవాద మెఱుంగ।
జగదాదిదేవ । గతి నీదుపదనతి।

కల్యాణి—ఏకతాళము.

ఆలకింపవా? దేవా! ఆదరింపవా? పల్లవి.
గానసుధారసపానలోలుండవు
వీణాగానమును వీనులవిందుగ। ఆలకిం॥

మనసుజగన్మోహనరూపముపయి
నునిచి సదా నిను మననముచేసెడి
మునిసుత యూర్వశి యొనరుచు
వినుతులు - ఆలకిం... ...

వి:- ఆహా హా! విదుషీమణీ! (చిఱునవ్వుతో) నీగానరస మా
స్వాదించి హృదయము పరవశ మైనది. ఆనందము పొంగిపొరలు
చున్నది. (లేచును)

ఊ. రు:— (వీణలు ప్రక్కలఁ బెట్టి లేతురు)

వి:—గానమూర్తీ! ఇది స్తుతి యనుకోకు నిజము చెప్పుచున్నాను.

చ. పురుషులయందు తుంబురునిపోలికఁ గాంతలలో విపంచికా
సురుచిరనిక్వణంబునకు జోడగుకంఠనినాద మొప్పఁ జా
తురి వెలయంగఁ బాడఁ గలతొయ్యలి యూర్వశి యంచు వింటి, శ్రీ
హరికృప నేఁడు వీనులకు హాయిగ గానము వింటి నెచ్చెలీ!

ఊ:—(సవినయస్మితముగా) సంగీతమందలియాదరాభిమానము లిట్లని
పించినవి గాని, యీ పాటిపాట మీరు వినకున్నారా?

వి:—విద్యాచాతుర్యమునకు వినయ మలంకారముగదా!-ఇం కేమనుకు?
నాయభిప్రాయము తెలిపెద నాలకింపుము.

మ. తనశక్తిం బ్రకటింప దేవజనవిద్యాదేవి నారాయణుం
డనుమానీంద్రుని యూరుదేశమున దివ్యత్కాంతిలావణ్యరం
జనరూపంబున నూర్వశీరమణివై జన్మించి సర్వాతిశా
యినివై విశ్వజనీనకీర్తి గనె నంచే నెంచెదన్ భామినీ!

ఊ:—(సిగ్గు నటించుచు) రాజులు పొగడించుకొనుటయే కాని, పొగ
డుట యెఱుంగ రనుకొన్నాను.

వి:—(నవ్వుచు) నిజమే కాని, నాకీపాఠము నీగానమహిమ నేర్పినదే.

(తెరలో)

గీ. రోహిణీచంద్రు లన్యోన్యమోహవశతఁ
గలియుటకై యని తారకల్ గగన వీథి
నెలయఁ జొచ్చెను రుచిమతీ! వేగ వచ్చి
యుంట మణిదీపములు తీర్చి యేగవమ్మ.

రు:—— ఇదిగో వచ్చుచున్నాను (నిష్క్రమించును)

వి:—— (సకౌతుకముగా) ఇది చక్కని యుపశ్రుతి

ఊ:—— (సాకూతస్మితముగా) మీచిత్తవృత్తి కట్లు తోఁచుట నైజమే.

వి:—— సఖీ! నీవు భావజ్ఞురాలవు రసికురాలవు. ఇంకేల? సఖ్యము పచ రించి యొక్కటి చెప్పుచున్నాను. సాదరముగా నాలకింపుము.

ఊ:——(కన్నవ విరియ సలజ్జముగా) సవినయాదరముగా నాలించెద.

వి:—— మ. కలగంబాఱని కన్యకాత్వము జగత్కల్యాణగాంధర్వ ము
జ్జ్వలసౌందర్యము నిత్యయౌవనము దివ్యంబైనజన్మంబు ని
ర్మలభావంబు మనోజ్ఞభాషణ మసామాన్యానుభావంబు నీ
చెలిమింగూడి సుఖింపఁ గోర్కి గలిగించెన్నాకుఁగాంతామణీ!

ఊ:—— (క్రిందు చూచుచు నాలోచన మభినయించును)

వి:—— (నిర్వ్యాజపాటుతో) అ దేమిచెలీ! భావగర్భితమగు నీపాటయు, నీహావభావము లిట్లు ప్రోత్సహించుటచేఁ గాని, విశ్రుతుఁడు ము న్నెన్నఁడైన వేశ్యను గోరియుండెనా?

ఊ:—— (ఉలికిపడి చూచి) మహీవరా! అన్యథా శంకింపవద్దు. నేను సురవారకాంతను గాని, లోకములోనివెలవెలఁదిని గాను-మీ కోరిక నిరాకరించుదానను గాను-మీరు ప్రభువులు నాయభి ప్రాయము తెలిపిన మీ రేమందురో యని యాలోచించు చున్నాను.

వి:— ఇది యొకజాణతనము గాని, ఎందుకో యేమో యందు నని ముం దాలోచించుచున్నావా?

ఊ:— (చిఱునవ్వుతో) అట్లయిన చిత్తగింపుఁడు.

చ. సిరిఁ దులఁదూఁగుభూవరులచిత్తము కామమయంబు, క్రొత్తక్రొ
త్తరుచుల వాలుచుండుటయె దానిగుణం, బది గాక యున్న న
ప్సరసలఁ బోలునట్టికులభామిను లుండఁగఁ గొంటెబుద్ధులుం
దగులను గోర్కెఁ జేయుదురె? నమ్మఁగవచ్చునె వారికూరిమిన్?

వి:— ఈయభిప్రాయము శ్లాఘ్యమే కాని, రాజు లందఱు నట్టివారే యని భావింపరాదు. అయుక్తమైనను నావిషయము నేనే చెప్పుకొనవలసివచ్చినది వినుము.

గీ. ఏకపత్నీవ్రతుండ నే నింతదనుక
నిదియె నాయాత్మరుచి కెల్ల మొదలు, నమ్ము.
నన్నిటకుఁ దెచ్చి దైవంబు నిన్నుఁ జూపి
నామనసు ముంచె నీదుసౌందర్యలహరి.

ఊ:- (భయవినయముల) మహారమణా! తెలియ కన్నమాటకు మనసు నొచ్చిన దేమో! (అంజలి ఘటించి) మన్నింపఁ గోరెదను. నిజముచెప్పుచున్నాను. ఇంతకు మున్నే మీసుగుణసంపద నాహృదయ మాకర్షించినది. కాని, ఒక్కసందేహము. అనురాగనిలయ మైనయంతఃపురము విడిచి యీకొండనెత్తము లందు మీ రుండఁగలరా?

వి:— ప్రేయసీ! దీని కింత చింతింపనేల? నాకు నీ వున్నకొంప యంతఃపురంబు, నాకు నీ వున్నకొండ నందనవనంబు. (అని సమీపించి చేయి చాపును)

ఊ:— (నాట్యమున పరిహరించి) మీయవ్యాజానురాగమున కానందించితిని. కాని, యింకొక్కకోరిక—

వి:— (తెల్లఁబోయి) ఇంకేమికోరిక?

ఊ:— క. ఏమిరా యనుకోరు గదా?

నామాటలు విన్న మీామనం బెటులౌనో?

సామాన్యపుఁగోరిక గా

దేమందురు!_ చెప్ప మందురే? నరనాథా!

వి:—చ. తలఁచిననీదుకోర్కె కవతారికయా యిది? లేక ప్రేషకాం,

తలసరసోక్తిచాతురివిధానమ? కాక వినూతనత్రపా

వలయితముగ్ధభాషణవిభావమ? యే మనుకొందు? నాతమిం

దెలియఁ బరీక్ష సేయఁ దలఁతే? యభిలాషము దెల్పు వేగమే.

ఊ: — (కులుకునవ్వుతో) ఉదారహృదయా! సమయ మడుగఁ గోరి జాగు

చేసితిని క్షమింపుఁడు.

వి:—ఇంకేమి సమయము ప్రేయసీ!

ఊ: — నాయనుమతి లేకుండా మీారు నన్ను విడిచిపోరాదు_ ఇదే నేఁ

గోరుసమయము.

వి:—ఔరా! దీనికా యింతయాలోచన? దృఢతరమైనప్రేమబంధము

గాని, యిది యొకసమయమా? నేను కోరవలసినది నీవు కోరినావా?

సరే యిచ్చితిని.

ఊ:—(సానురాగవీక్షణముగా జూయుచు) పరమానందము_(తెరవంక

చూచి) రుచిమతీ!

రు:—(తెర తొలఁగించుకొని వచ్చి దివ్యకుసుమమాలికలు చెఱియొకటి

యిచ్చి వెళ్ళును)

(ఊర్వశీవిక్రమతు లొకరికంఠము నొకరా పుష్పహారముస

నలంకరింతురు).

( తెర లో )

అయం ముహూర్త స్సుముహూర్తో ఽస్తు

చ. జనవిభుఁ డైనవిక్రమునిసంగతి నూర్వశి గాంచు సత్సుతా
దనులను యాదవాన్వయము ధాత్రిఁ బ్రసిద్ధికి నెక్కు, నెందు కో
స్తుతిశీల మం దనేకపురుషుల్ భువి నేలఁ గ్రమంబుగా జనిం
చినవసుదేవుగర్భమున శ్రీహరి పుట్టును ధర్మరక్షకై!

(ఇరువురు సహర్షముగా నంజలి ఘటింతురు)

వి:—ప్రేయసీ! ఈశుభాశీర్వాదము గావించినవా రెవరో! ఆహా! గొప్ప మాట వింటిని. మాయనువంశమున శ్రీహరి వాసుదేవుఁడై యవతరించు నఁట! ఈదీవనచే మావంశ మంతయుఁ దరించినది.

ఊ:—ప్రాణప్రియా! అదిగో చూడండి. ఆవిమానమునఁ బోవుచున్న యష్టవసువులే దీవించినవారు.

వి:—ఎంతపుణ్యము! ధన్యుఁడను.

ఊ:—మీసాంగత్యమున నేను ధన్యురాలను.

ఇరువురు:—వసుదేవతలారా! వందనము వందనము.

(యవనికా స్తరితులై నిష్క్రమింతురు)

—o—

# విశ్రుతోర్వశీయము

## పంచమరంగము—యదురాజ సభామందిరము.

—ద్వారము వెలుపల ప్రతీహారి, రాజభటులు, నూతనపురుషుఁడు—

—కులమంత్రి భార్గవానందుఁ డాలోచించుచు ప్రవేశించును—

భా:—(సనిర్వేదహాసముగా) ఈశ్వరేచ్ఛ. జనప్రియుఁ డైనపరిపాలకుఁ డనిపించుకొన్నవిశ్రుతుఁ డచింతితముగా వనవాసి యైనాఁడా? వానప్రస్థము స్వీకరింపఁ దలఁచిననే నింకను రాజకార్యపంకమున దిగఁబడి పోవుచున్నానా? ఔరా కర్మఫలము! అటు పట్టమహిషి మనోవ్యథ, ఇటు రాజ్యలక్ష్మిచీకాకు. డెబ్బది దాఁటి జీవించి నందుకీదుఃఖభారమంతా నాపరమా? (మోమెత్తి) అంతే. దయాశీలుఁ డగువైద్యునిమాడ్కి ధర్మచింతనుఁ డగుమంత్రి పరదుఃఖదుఃఖితుఁడు కాక తప్పదు—కానీ! ఈశ్వరీకరుణాకటాక్ష మెట్లున్నదో!—ఎవ రక్కడ?

ప్రతీ:—(ప్రవేశించి) చిత్తము మహాప్రభూ!

భా:—ఎవరేని చూడవచ్చినవా రున్నారా?

ప్ర:—చిత్తము. ఒక రున్నారు.

భా:—పంపించు.

ప:—చిత్తము. (వెళ్లును)

ఒక:—(ప్రవేశించి), మహామాత్యా! నమస్కారము.

భా:—రావోయి గిరినాథా! పశ్చిమజనపదవార్త లేమి?

గిరి:—(సంతోషముతో) ఎన్నని విన్నవింతు మహాత్మా! సకలసస్య ఫలసంపన్నమై జనపద మంతా కలకల లాడుచున్నది. మఱియు.

గీ. శ్రీమహారాజ్ఞియాజ్ఞకుఁ జేతు లొగ్గి,
మసలుచున్నారు సకలసామంతవిభులు,
రామరాజ్యంబు మాతల్లిరాజ్య మనుచు,
సంతసించుచు నున్నారు సకలజనులు.

భా:—పరమసంతోషము. తరువాత—

గిరి:—ప్రాగ్దక్షిణవార్తలు విదితములు గదా!

భా:—అందలిసామంతులు విధేయులై కప్పము లంపియున్నారు.

గిరి:—ఇక నుత్తరదేశసామంతులలో చేది దాశ శబర పురరాజులు తప్పఁ దక్కినయందఱు మహారాజ్ఞిశాసనమును శిరసా వహించి వశవర్తులైనా రనుటయే విశేషవార్త.

భా:—ఆత్రిపురాసురులగర్వ మణఁగినచో నిఁక నిశ్చింతయే.

గిరి:—సచివోత్తమా! తమశక్తిత్రియమునుం దాపురత్రియ మాఁగునా? ఇదిగో! కుమారమంత్రిగా రిచ్చినలేఖ.

భా:—(విప్పి చదువుకొని) గిరినాథా! నీ వన్నట్లయినది. (సంతోషముతో నిజాసన మధిష్ఠించి) శాత్రవాగ్ని శాంతించినట్లే.

గిరి:—అందు కనుమానమా? నేఁడు విజయవార్త వినమా?

గీ. దురభిమానదురాశలు పెరుగుఁ గాక,
వారు మనసేన నెదిరించి పోరువారె?
కడుపుమంట మనంబును గలఁచుఁ గాక,
కాలు ద్రవ్వునె గజము సింగంబుఁ గాంచి?

[తెరలో కలకలము]

గిరి:—అది గంగాదాసును జూచినయానందమే యనుకొందును.

ప్రతీ:—(ప్రవేశించి) దేవరా! చేదిరాజమంత్రిని చేతులు కట్టి తీసుకొని వచ్చినారు.

భా:—బంధములు విడిపించి తీసికొనిరా.

గం:—చిత్తము—(అట్లు చేసి వెళ్లును)

గం:—ఆర్యవర్యా ! దయాహృదయా ! క్షమింపుడు. రక్షింపుడు.

గిరి:—ఆరునెలల క్రిందట నేను దర్శనము చేసినగంగాదాసుగా రేనా?

గం:—(తల వంచుకొనును)

భా:—(కిక్కుతో లేచి) నేడు కృతఘ్నునిమొగము చూచితిని. 'శాంతం పాపం'

గం:—స్వామీ ! దాసుడను.

భా:—స్వామి ద్రోహివి. నమ్మినవారిగొంతుకలు కోయుజాతి నీది. నీ పాప మిప్పటికి పండినది. విషజంతువుల వినాశమునకు వాటి విషమే మూలము.

గం:—(చేతులు జోడించి వంగి) దోషినైతే శిక్షాపాత్రుడనే ... ...

భా:—ఎందు కీప్రలాపము ? ఆత్రిపురాసురులను గంగలో దింపినవాడెవడు ? మాకు శ్రమ గలిగించినవాడెవడు ?

గం:—అదంతా నాదోషము కాదు—విచారణ చేయింపుడు.

భా:—రాజద్రోహివి. నీకు పుట్టగతులు లేవు. చేదిరాజును మహారాజును జేసి నీవు మహామంత్రిత్వము వెలిగింపవలె ననుకొన్నావా? ఎంత దుశ్చింత ?

గం:—లేదు లేదు మహాత్మా ! పరాధీనుడను ... ...

భా:—లోకజ్ఞానశూన్యులాదాశశబరరాజు లిద్దఱు తో డయినంతనే మీజాతికి సామ్రాజ్యము వచ్చు నని యోసించితివా ?

గం: (గద్గదస్వరముతో) మన్నించి నామనవి చిత్తగింపుడు.

భా:—ఇంక నో రెత్తకు. పట్టమహిషి సామ్రాజ్యము పాలించుట శాస్త్రసమ్మతము కా దంటివా లేదా ?

గం:—మహానుభావా ! అది నామాట కాదు..

భా:—పాపము బద్ధ మైన దని తెలిసి కూడా కాదనుచున్నావా ?
ఎంత కైన తగుదువు—జ్ఞాతి యైనా చేదిరాజు వినయశీలుడు
సామ్రాజ్యభక్తుడు. అతనికి పుట్టినబుద్ధి కాదు. నీవు
నేర్పినదే.

గం:—శివశివా !

భా:—గంగను స్మరించు. అదే నీకు గతి—ధర్మశాస్త్రనిర్ణయమునకు
నేడు నీవు బ్రహ్మర్షి వైనావా/? భటు లెవ రక్కడ ?

భటు లిరువురు:— (ప్రవేశించి చేయెత్తి మ్రొక్కి) దేవరా! ఆజ్ఞ

భా:— ఈగంగాదాసుడు బంధనాగారమునకు గొనిపొండు.

భటు:— చిత్తము మహాప్రభూ! (అట్లు కొనిపోవుదురు)

(తెరలో భేరీనినాదము)

గిరి:— (నవ్వు మొగముతో) అదిగో జయభేరి మ్రోగుచున్నది.

భా:— (సానందముగా) మహారాజ్ఞితపస్సు ఫలించినది.

[మరల తెరలో]

ప్రథితయాదవరాజేంద్రిరా! జయంబు,
దివ్యకీర్తీ! పతివ్రతా దేవి! జయము
నయవిశారద! భార్గవానంద! జయము,
శత్రుమర్దన! శ్రీకంఠ! జయము జయము.

గిరి: అదిగో! వందిమాగధులస్తుతిగానము—(అటు చూచి) అదుగో
శ్రీకంఠమనీషి—

శ్రీ: - (సర్వసేనాధ్యక్షు వేషముతో ప్రవేశించి) తాతపాదులకు వంద
నము.

భా:—కుమారా! చిరాయువు కమ్ము—రాజ్యము నిష్కంటకము గావించి
రాజఋణము తీర్చితివి. నాహృదయ మానందమగ్న మైనది.

శ్రీ:- అది మహారాజ్ఞితపోమహిమ. తాతపాదులయాశీః ప్రభావము.

భా:- ఆత్రిపురాసురుల నేమి చేసితివి?

శ్రీ:- (దరస్మితముగా) జీవగ్రాహముగాఁ దెప్పించి మనయారామ మందిరములఁ బ్రవేశపెట్టించితిని.

భా:- సాధుసమ్మత మైనపని చేసితివి-అక్కడ?

శ్రీ:- ఆమూఁడుమండలములు రక్షింప మనముగ్గురు సేనానులను నియమించితిని. అనంతరకర్తవ్యము తమ రాలోచింతురుగాక.

భా:- సరే. నేను మహారాజ్ఞికీవృత్తాంతము విన్నవింప నేగెదను. ఇఁక మీపనులు మీరు చూచుకొనండి.

[అందఱు నిష్క్రమింతురు]

—o—

# విశ్రుతోర్వశీయము

## షష్ఠరంగము—దుర్గప్రాకారములోని దుర్గామందిరము.

[పట్టమహిషి పతివ్రత తపస్వినీవేషముతో మల్లిక వెంటరాఁగా ప్రవేశించును]

పతివ్రత:— (బద్ధాంజలియై నిలచి)

శ్లో. శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ భక్తాభీష్టప్రదాయినీ
రాజరాజేశ్వరీ దేవీ పాతు మాం జగదీశ్వరీ.

[అని పఠించి మానసికారాధన మాచరించుచుండును]

మల్లిక:—(పాడుచుండును)

శ్రీ రాజరాజేశ్వరీ!
సేవింతు నినుఁ గోరి శీతాచలకుమారి! శ్రీరా—
రావమ్మ శర్వాణి! రాజశేఖరురాణి!
నీలాంబుధరవేణి! నీరేజమృదుపాణి! శ్రీరా—
రత్నసింహాసనము రంజిల్లఁ గూర్చొనుము,
అఖిలోపచారమ్ము లర్పింతుఁ గైకొమ్ము, శ్రీరా—
పున్నాగమందారపుష్పాల మనసార,
నర్చింతుఁ బూదండ లర్పింతు మెడనిండ, శ్రీరా—
కర్పూరదీపాలు కస్తూరిధూపాలు
తేజస్తిమిరమైత్రి తిలకింపు శుభగాత్రి! శ్రీరా—
పండుతాంబూలంబు బంగారుపుష్పంబు
ఆత్మప్రదక్షిణము లంబా! సమర్పణము. శ్రీరా—

పతి:—(దేవీపాదకుంకుమ ఫాలమున ధరించి దోసిలి ఘటించి)

చ. పతి నెడఁ బాపి నన్నుఁ బలుబాములఁ బెట్టెను తొంటిపాప మీ
గతిఁ బదునాలుగేండ్లు నిను గట్టిగఁ గొల్చినఁ గూడఁ బోని దో

బ్రతికినదానఁ గాక మొఱ వ్రాసినదానను గాక యెట్టులీ
క్షితిఁ బడి యుండఁజాలుదు? నినీ! కను లుండియు గ్రుడ్డిదాననై.
తల్లీ! నే నీవిరహాబ్ధి నీదఁ జాలను. ఈయవమానము భరింపఁ జాలను.

చ. పతివిరహార్త యైనపతివత్నికి లోకము జీర్ణకాననం
బతినిబిడాంధకార మని యమ్మ! యెఱుంగవె? యాత్మహత్య దు
ర్గతి కగుఁగాక, యీ బ్రతుకుకంటె నదే సుఖమంచుఁ దోఁచె నా
మతి కిపు, డైన నింక నొకమాసము చూచెద నీకృపాప్తికిన్.

[తెరలో] మల్లికా!

ప:—ఎవ రది ! చూచిరా !

మ:—(వెళ్లి వచ్చి) కణ్వమహర్షిగారు దయచేసినా రఁట !

ప:—(ఆశ్చర్యముతో) ఎంతపుణ్యము ! కులగురువు లే ? తల్లి కరుణించి నది. ఎక్కడ నున్నారో !

మ: —పెద్దమంత్రిగారు వారిని గురుమందిరములో ప్రవేశపెట్టినారఁట !

ప:- -అమ్మా ! నమస్కారము—మల్లికా పద ! పద (పరిక్రమింతురు)

మ: —అరుగో మహర్షులు !

[ఉచితాసనాసీనుఁడై కణ్వుఁడు ప్రవేశించును]

-నీ వీద్వారముకడ నుండుము (లోఁ జని యంజలి గూర్చి) మహాత్మా గురువరా ! వందనము.

క: -సౌభాగ్యవతీ భవ. (తేఱి చూచి) ఎవ రమ్మాయీ !

ప:—గురువర్యా ! శిష్యురాలు పతివ్రత—

క:—(లేచి) ఏమిటీ ! పట్టపుదేవివా ? ఔరా! ఎంతమార్పు ?

గీ. రాజరాజేశ్వరీదేవిపూజ చేయు
పట్టమహిషికిఁ దోడుగాఁ బరగునట్టి

యగ్గ లకాంతి యైనముత్తైదు వనుచు,
పొరపడితి నమ్మ ! నినుఁ జూచి పుణ్యసాధ్వి !
కుమారీ ! నీ ధర్మాచరణము వనితాలోకమున కుత్తమోదాహరణము.

ప:—(డగ్గుత్తికతో) పూజ్యపాదుల దర్శనమున నాదుఃఖము పొంగివచ్చు చున్నది. (విషాదము)

క: — కుమారీ ! లోకజ్ఞురాలవు. ధైర్యమే శరణము.

ప:—(కన్ను లొత్తుకొని) ఎంత కని మహాత్మా ! ఆనేకుహిమాచల మాఱుసార్లు వెదకించితిని. ఎక్కడా ! (దుఃఖము) నాజీవితేశ్వ రుఁడు క్షేమముగా నున్నట్లు తమదివ్యదృష్టికి గోచరించెనా !

క:—అతఁడు సుఖముగా నున్నాఁడు విచారించకు.

ప:—ధన్యురాలను మహాత్మా ! ఆమాట చాలును. దయచేసి పీఠ మలంకరింపుఁడు.

క: —(అట్లు చేయును)

ప:—నూతనరాజ్యలక్ష్మిని గూడా స్మరింపక ఇంతకాల మెంచుండెనో? హేతు వేమో ! !

క:—ఏమి చెప్పను కుమారీ ?

ప:—(దిగులుతో) అంత చెప్పరానికారణమా స్వామీ ! (గోసిలి యొగ్గి) నామనస్సు పరిపరివిధములఁ బోవుచున్నది ... ...

క:—అధైర్యపడకు (లేచి) ప్రమాద మేమీ లేదు.

గీ. ఎక్క డుండిన నేమి? యదృష్టశాలి
నిత్యకల్యాణసుఖయోగనిష్ఠ నుండె,
రాజ్య మనుమాట యేమి? సర్వంబు మఱచి
యైహికానందమూర్తియై యలరుచుండె.

(ఆశ్చర్యచకితయై) ఏమి టిది మహాత్మా! నాయార్యపుత్రుఁ డా త్మజ్ఞుఁడు. అంత మఱచా? ఎంత వింత!

ఉ. ఆడినమాట తప్పు, రెండు రాడరు పెద్దల, కన్యకాంతలన్
జూడరు కోర్కిమై, శరణుచొచ్చినశత్రువు నైనఁ గిన్కఁ బో
నాడరు, ధర్మనిష్ఠ దిగనాడ, రహో సుగుణాలవాల! మే
నాఁడును లేనియీమఱపు నాదురదృష్టము తెచ్చి పెట్టెనే!

క:—కాల మొక్కరీతిగాఁ గడచునా? మంచిచెడ్డ యగును. చెడ్డ మంచి యగును. అది లోకమునైజము. ప్రపంచమునం దసంభావ్యమేదియు లేదు. నీ వెఱుఁగని దే మున్నది?

ప:—ఏమిది మహాత్మా! నామనస్సు కలవరపడుచున్నది. దిక్కు చూపరా?

క:—కుమారీ! నిదానించి వినవలెను గాని తొందరపడరాదు

గీ. అప్సరోగిరి చూడంగ నరిగి యచట
వార్యాశిని గాంచి మోహించి యొడలు మఱచె

ప:—అయ్యో! ఎంతపాపము! ఎంత ఘోరవార్త? కర్ణశూలము మనశ్శల్యము. హాహా! [తల చేతులఁ బట్టుకొనును]

క:—గీ. దానితోఁ గూడి యుండె నిందనుక, నిపుడె
తెలివి యొక్కింత వచ్చిన తెరువు శోధించె.

ప:—ఇంకేమి తెలివి? హా దైవమా! నాపరమానురాగభాజన మైన మానవరత్నమును వేశ్యమెడ కంటఁగట్టితివా? హా పరమేశ్వరీ! ఇది యావజ్జీవదుఃఖమే. (మూర్ఛిల్లును)

క:—అయ్యో ప్రమాదము! స్త్రీహృదయము దుర్బలము కదా! ఎవరక్కడ?

(తెరలో) చిత్తము చిత్తము.

మల్లిక:—(వచ్చి) అయ్యో! ఎంతకష్టము తల్లీ! (లేవ నెత్తి) అమ్మా మనసు నిలపండి (కన్నులొత్తి మెడ నిమురును)

ప:—(నిశ్వసించి చూచి) నీ వెందుకు వచ్చినావు? పో! (లేచును

చు:—చిత్త మమ్మా! (వెడలును)

క:—అయ్యో కుమారీ ! కడపటిమాటవల్ల కొంచె మైనా దుఃఖము శాంతించు ననుకొన్నాను గాని మితి మీఱిఉ నను కోలేదు. ఎంతపని జరిగినది ?

ప:—(ధైర్యము నటించి) గురువరా ! మేలే జరిగినది. నాదుఃఖ మొక్క మాఱు తుదముట్ట పొంగి మొదలంట నణగంటినది. ఇఁక దుఃఖమే లేదు—

క:—ధీరశాంతవు గదా ! మనసు చేపట్టు—

ప:—స్వామీ ! ఇది పరాకుమాట కాదు. మనోనిశ్చయముతో నన్న దే.

గీ. తనువులే వేఱుగాని చిత్తం బొకంటు
గాఁగ నన్యోన్యగాఢానురాగ మలర
నున్నయావేడ్క మరల నా కొదవఁ బోదు
మరలు గొన్నట్టియామది తిరుగఁబోదు.

ఇఁక నిరాశా పరమం సుఖ మ్మనుసూక్తియే శరణము.

క:—అట్లనరాదు. కొలఁదిదినములలో నీకు పతిసందర్శనభాగ్యము పట్టనున్నది.

ప:—మహర్షులమాట యమోఘము. మహారాజదర్శనము మహాభాగ్యము. అయితే ! అనుచితకామవర్తనమున వచ్చినపాతిత్యముమాట యేమి ?

క:—(సస్మితముగా తలపంకించుచు నాలోచించుచుండును)

ప:—[తీవ్రదృష్టితో] ఆహా ! కామ మెంతకైనా తగును.

ఉ. నీతి దలంపనీక కులనిందకుఁ జింతిలనీక రాజ్యవి
ఖ్యాతి గణింపనీక సతియందనురాగము నిల్వనీక యా
తాతలనాఁటిభోగినికి దాసుని జేసితె యాదవేంద్రు ? నా
హా! తలపోయ కెట్లు పురుషార్థముఁ జేసితొ నిన్నుఁ గామమా ?

క:—[చిఱునవ్వుతో] పతివ్రతా! సధర్మమైనకామము పురుషార్థమే.

ప:—[గోసిలి యొగ్గి] భర్తదోషము లెన్నరా దందురు. క్షమింపుఁడు.
ఇపుడు యాదవేంద్రునికామ మెట్టి దందురు ?

క:—గృహస్థధర్మవిరుద్ధము గావున దూష్య మనక తప్పదు.

ప:—స్వామీ! నమస్కారము. ఇఁక నిరాశ గాక మఱేమి ?—దేవి
జగదీశ్వరీ! ఇఁక నీపాదసేవనమే నాకు ముక్తిసాధనము.

క:—మహారాజ్ఞీ! చిత్తశాంతి లేనిభక్తివిరక్తులు నిలుచునా ?

చ. తెలిపినదాన విట్టిపరిదేవన మెందుకు ? నీకు నీశ్వరీ
బలమున నెల్ల చక్కఁబడు, భర్తృసుఖంబును బుత్రలాభముఁ
గలుగును, నీసుతుం డవనినాయకుఁడై నుతి కెక్కుఁ గష్టముల్
తొలఁగెను సంపదాళిఁ దులఁదూఁగెద వింకఁ బతివ్రతామణీ!

ప:— (ఆశ్చర్యానందములతో వంగి నమస్కరించి) మునీంద్రా! ఈ
యమృతవాణి నాచిత్తశాంతికి మూలము—అయితే ముందుగతి
యేమి?—

క:— గతి కేమి? దోషమునకు ప్రాయశ్చిత్తము లేదా?

ప:— (ఉలికిపడి) గురువర్యా! ప్రాయశ్చిత్తమా? అ దెట్లు?

క:— భయ మేమి? ఔను. ప్రాయశ్చిత్తము పాపహరణము—అతని నా
యొద్దకు పంపుము.

ప:— అది నాతరమా?

క:— జంకేల? మహారాజ్ఞివి కదా! నీతి నుపయోగింపుము.

[తెరలో—ఘంటానాదము]

క:— కుమారీ! మాధ్యందినకృత్యములవేళ యైనది.

ప:— చిత్తము మహాత్మా! వందనము.

[ఇరువురు నిష్క్రమింతురు]

# విశ్రుతోర్వశీయము

## సప్తమరంగము—కొలువుకూటము.

—♦ రత్నసింహాసనమున మహారాజ్ఞీచిత్రపటము ♦

[ సింహద్వారమున తెర వాలియుండును ]

—♦ కొలువుకూటము ప్రక్క మంత్రికచేరీ చావడి ♦—

భార్గవానందుఁ డొక్కఁడే యాలోచించుచు కూర్చుండి ప్రవేశించును]

భా:— కష్టములు కాఁపురము చేయ వందురు గాని, నాకష్ట మట్టిది కాదు—పాదుకొని పోయినది (ఎడమచేత కపోలముచేర్చి) ఇం కేమి వెదకింపను? జారా! ఎంత వింత? (నిశ్వసించి) హా! ఎంత పనిచేసితివి విశ్రుతా! ఎందున్నావు నాయనా !!

విశ్రుతుఁడు:— (అదృశ్యరూపమున ప్రవేశించి మంత్రిప్రక్కనున్న యుచితాసన మధిష్ఠించి మంత్రిని చూచి సవిచారముగా) సత్యమే, ఘోరకృత్యమే—

భా:— రాజ్యము యథాపూర్వముగా స్థిరపడినది, నేను కణ్వాశ్రమము నకు పోవచ్చు ననుకొంటే, యెప్పటి కప్పుడే, ఆతల్లిదుఃఖము నన్నిల్లు కదలనీయ కున్నది—

వి:— అయ్యో! (తల వంచుకొనును

భా:— ఇఁక నాకర్మ మింతే కాఁబోలు! (అని చేయి వాల్చి, యులికిపడి లేచి, ఏమి టీవింత! శరీరస్పర్శ మైన ట్లున్నది. (వెనుక కడుగు వేయుచు నెడమప్రక్క చూచి ఎవరును కనఁబడరే! భ్రాంతి పడ్డానా? అయ్యో !! భ్రాంతి కాదు (ఆశ్చర్యముతో నిట్టటు చూచును)

వి:—(లేచి దృశ్యుఁడై బద్ధాంజలియై) ఆర్యా! నమస్కారము.

భా:—[నివ్వెఱపడి] ఎవ రయ్యా! [తేఱి చూచును]

వి:—అయ్యా! నేను విశ్రుతుఁడను.

భా:—విశ్రుతుఁడా? మామహారాజవిశ్రుతుఁడేనా? [ఆపాదమస్తకము చూచును]

వి:—ఆర్యవర్యా! సంశయింపకండి. మీశిష్యుఁడైన విశ్రుతుఁడే—

భా:—కంఠస్వర మదే కాని, రూపము... నాదృష్టిదోషమా? [సమీపించి] నాయనా! ఖేచరవిద్యలు నేర్చినావా? [కౌఁగిలించి కన్నీరొలుక] మా రత్ననిధి మాకు దొరకినదా? బ్రతికియున్నందున నిన్నుఁ జూచుభాగ్యము పట్టినది [కన్నుల నొత్తుకొనుచు] ఇంత కాలము—

వి:—మీరు పెద్దలు లోకజ్ఞులు వివిధవిద్యాపారంగతులు నాగురువులు, మీ కేమని విన్నవింతును? కర్మఫలము తప్పింపుకొనఁ దరమా?

భా:—నిజమే—కాకున్న సాధ్వీమణి యైనమహారాజ్ఞి కింత దుఃఖమా! కాలము సమీపించిన నా కింతభారమా! [కన్నులు తుడుచు కొనును]

వి:—[తల వంచుకొని సవిచారముగా] అయ్యో! ఇఁక నేను దేవిమొగ మెట్లు చూతు నార్యా!

భా:—ఆతల్లియవస్థ చెప్పఁదరమా నాయనా! ముందు కబురు పంపి వత్తు నందుము—

వి:—ఆకబురు తరువాత—ముందీచిత్తరువు పంపండి. [అని తనచిత్రపట మిచ్చును]

భా:—[రాజుమొగము చిత్రము పరిశీలించుచు] అయితే, ఇది నాటి రూపము కాదు. ఇప్పటినిజరూపమే. ఔరా! భాగ్యవంతుఁ డెక్కడున్నా భాగ్యవంతుఁడే.

వి:— [చిఱునగవు

భా:— ఏమీ యపూర్వముఖలావణ్యము! [అది కొనిపోయి దేవికి పం
పించి వచ్చి] నాయనా! ఇంతకాల మెం దున్నట్టు? భరతవర్ష
మంతా గాలించినాం, ఎక్కడా ... ... ...!

వి:— ఏమి చెప్పుదు? దైవము చూపినచోట నుంటిని. ఇంకెందు కా
గొడవ?

భా:— ఏం దున్నావో గాని, నీముఖకాంతినిబట్టి చూడ నాప్రదేశము
లోకోత్తర మని తోఁచుచున్నది. పట్టమహిషికి విచిత్రము
విచిత్రముగా తోఁచును—అబ్బా! ఆదేవిమాట తలఁచుకొంటే
కడుపు చెఱు వగునుగదా!

వి:— [సవిచారముగా] దైవలీల ... ...

భా:— పదునాలుగేండ్లు శ్రీరాము నడవికి గెంటిన దైవముకూడా యింత
ఘోర మైనది కాదు. ఆసతీమతల్లిని సీతను రాముని వెంట నుండ
నిచ్చినది. ఈదైన మీసాధ్విని పతివ్రతా దేవిని— [సగద్గదిక]

వి:— [సాశ్రునయనుఁడై] ఆర్యా! మన్నింపుఁడు. హృదయము ముడిగి
పోవుచున్నది.

భా:— అయితే, దేవికి ప్రతికూల మైనా యీదైవ మన్నివిధముల
నీ కనుకూల మైన దనుట నిజము. ఏమందువా?

చ. తొలుతటినాలుగేండ్లు కడు దుష్కర మయ్యెను నీవు కోటనుం
డొలఁగినయందు గన్నరిపుదుర్మతిచే యమరాజ్యరక్ష, యా
యలజడి యేమిచెప్ప ? జగదంబను గొల్చెడి దేవిసత్తపో
బలమున దక్కెఁగాక కనవచ్చునె యాదవరాజ్య మింత సౌ ?

వి:— [నిట్టూర్పు పుచ్చి] ఆమహారాజ్ఞిపాతివ్రత్యమహిమకు వంద
నము. నయకోవిదు లగుమీామంత్రి నమస్కారము. ఇంక
రాణిని జూచి యపరాధము మన్నింప వేఁడెదను.

[తెరలో ఘంటానాదము]

◆సింహద్వారము తెర పైకిలేచును—వందిమాగధు లిర్పక్కలనుందురు◆

భా:—సరే! [రాజుచెయ్యి పట్టుకొని ధర్మాసనము వంక నడుచును]

వి:—ఇ దెందుకు?

భా:—ముందు సింహాసనము చూచి పిదప—

వి:—[కన్నీరు రాదవ గద్దెవంక చూచి] దేవి సింహాసనముపై నున్న దని
చెప్పినారు కా రేమి?

భా:—మఱచినానో భ్రాంతిపడినానో! దృష్టి నిలిపి మరల గద్దెవంక
చూడుము.

వి:—(కన్నులు తుడుచుకొని చూచి) ఔరా! చిత్తరువా? ఎంత
భ్రాంతి? (సవిచారముగా) ప్రమత్తుఁడను వంచకుఁడను—

గీ. రాజ్యలక్ష్మిని మించినరాజ్యలక్ష్మి
ప్రాణమునకన్న నెక్కుడుప్రాణ మనుచు,
వఱలి మూర్ధాభిషేకోత్సవంబునాఁటి
దేవిరూపంబు నేనె చిత్రించినాఁడ.

[ఇరువురు గద్దెచెంతకు వత్తురు]

[తెరలోసాయాహ్నమంగళారావము]

—◆ ద్వారమున వందిమాగధస్తుతి ◆—

వం:—సీ. ఏరాణిధర్మరాజ్యారంభవిధులఁ గృ
తంబుగా మాటె నీద్వాపరంబు?

మా:— ఏవ్రతశీలపాతివ్రత్యమహిమ కా
బాలగోపాలంబు కేలు మోడ్చు?

వం:— ఏపట్టమహిషియాజ్ఞాపత్ర మఖిలసా
మంతవర్గము దాల్చు మస్తకమున?

మా:— ఏవిశ్రుతార్ధాంగియావి భూవిశ్రుతం
బై యర్థిసంతృప్తి ఁచరించు?

వం:— గీ. ఆమహారాజ్ఞి పుణ్యసాధ్వీమతల్లి
మా:— భవ్యయాదవసామ్రాజ్యభాగ్యలక్ష్మి
వం:— ధీరశాంత పతివ్రతాదేవి కిదె
మా:— పండువెన్నెలమాడ్కి విశ్వంబునిండె.
వి:— (ఆనందపరవశుఁడై రాణిపాదము లంటును)
వం: — గీ. అఖిలరంజనపరిపాలనా! జయంబు
మా:— సకలసామంతవందితాజ్ఞా! జయంబు
వి:— నన్నుఁ జూచి సామంతరా జనుకొన్నాఁడా యేమి?
భా:— నిన్నుఁ జూడలేదు. అట్లనుకోలేదు. ఇది నిత్య స్తవమే.
వం: గీ. రత్నసింహాసనాధికారప్రభావ
దీపనీ! పతిభక్తిమూర్తీ! జయంబు.
వి:— (చేతులు జోడించి) దేవి! నీవిఖ్యాతి వీనులవిందైనది.
భా:— ఇఁక నంతఃపురమున రాణిని దర్శింపుము—నే నుందును. (యవనికాంతరితుఁడై వెళ్ళును)

[అంత రాజుచిత్తరువు చూచుచు విచారించుచున్న పతివ్రత తపస్విని వేషముతో నొకవంక ప్రవేశించును]

వి:— (పరిక్రమించుచు) అకటా! కాళ్ళు తడఁబడుచున్నవి—హా దేవీ!...
ప:— అయ్యో! ఎంతటిభాగ్యహీనురాలను!— ఆవయ స్సట్లే నిలచినది! ఆలావణ్యము రెట్టింపైనది! ఎంతచిత్రము! ఏమిమహాత్మ్యము! ఔరా! నన్ను చూచి యే మనుకొందురో! యేమందురో!!
వి: ప్రేయసీ! గుండె దడదడ లాడుచున్నది. ఎట్లు చూతునో!...
హా! ఆర్యపుత్రా! మీరు సౌందర్యకాములు. మీతపస్సు ఫలించినది. (సవిషాదముగా) ఆనాఁటిరూపమే నచ్చలేదుగదా! ఈనాఁటినారూపము మీకు నచ్చునా? అయ్యో!!
వి: సతీమణీ! రూపమోహమున పాప మొనరించితిని. ఈ ద్రోహి నెట్లాదరింతువో! నీముఖ మెట్లు చూతునో! హా! హా!

ప:—(నిశ్వసించి) హా! ఆర్యపుత్రా! మీ మొగ మెట్లు చూతునో! లజ్జా శోకావమానములు మనస్సును కలఁచివేయుచున్నవి— గురువరా! ఏమందునో, ఏమి పాపము తెచ్చుకొందునో!—నీయాధీన నయ్యే నాకు దిక్కు.

గీ. ఎట్టు లోర్చితినో దుఃఖ మింతకాల,
మింతబాధ యెఱుంగ నిదేమివింత?
నోము పండెను విభుని గన్గొందు ననఁగ,
భగ్గు మనుచుండె హృదయంబు పట్టఁజాల.

వి:—[అంతిపురమున నడుగు పెట్టును]

మల్లిక:—[తెల్లఁబోయి చూచి] దేవా! ఇట్టిటు ... ... ...

వి:—[కలయఁజూచి] ఇది శ్రీనివాస మేనా? అయ్యో! ఆశోభ యేది?

ప:—తల్లీ! ఈశ్వరీ! నానోట నెట్లు పలికింతునో! [విషాదము]

వి:—గీ. దేవిచందంబు ముందుగాఁ దెలిసికొనఁగ,
రాణివాసంబు నాకుఁ బ్రమాణ మయ్యె,
అమ్మహాదేవిపాదంబు లంటి మ్రొక్క-
నర్హతయు లేనిపతితుండ నైతి నేను.

మ:—అదే రత్నపీఠము విచ్చేయుఁడు [చూపి వెళ్లును]

వి:—[తల వంచుకొని దోసిలి యొగ్గి] దేవీ! దోషిని క్షమింపుము [విషాదము]

ప:—[పాదము లంటి మ్రొక్కి] ఆర్యపుత్రా! హా! హా! [దుఃఖము]

వి:—రక్షించు రక్షించు. [కాళ్ళపైఁ బడును]

ప: [ఏడ్పుగొంతుతో] అయ్యో! నా కీపాపముకూడా ... ... [లేవ నెత్తును]

వి:—దేవీ! నో రాడ కున్నది. [విచారము]

ఔ:—[దుఃఖముతో] నాథా! నా కీజన్మంబులో దర్శనమే లభింపదను కొన్నాను [చేతులు పట్టుకొని] కంటఁ బడ్డారు. ఇదే పదివేలు. (కన్నీరు)

వి:—దేవీ! వద్దు వద్దు. నీవు దుఃఖించిన నాగుండె పగిలిపోవును [తన కన్ను లొత్తుకొని యామె కన్ను లొత్తి బుజమునఁ జేయి వైచి తేఱిచూచి గద్గదస్వరముతో] అయ్యో! దేవీ! [కన్నులు మూసికొని వెనుక కడుగు వేసి] ఈవేష మేమి ప్రేయసి! [విచారము]

ఔ:—(సవిచారముగా) భర్త ప్రవాసమందున్నపుడు భార్యకు విహితమైనవేష మిదేకదా!

వి:—ఔరా! ఎట్టిరూప మెట్లయినది? (ప్రక్కకు చూచుచు) అయ్యో!!

సీ. చలినీట నిత్యంబు స్నానమాడుదు వంచు
చాయ మాసినశిరోజములు దెల్ప,
పైడిచీరలు పచ్చపట్టుచీరలు దరిఁ
జేర నీవని కావిచీర దెల్ప,
తారహారాద్యలంకారధారణము కో
ర వటంచుఁ బసుపుసూత్రములు దెల్ప,
కస్తూరితిలకంబు గైసేయ వని ఫ్రాజఁ
బెట్టిన కుంకుముబొట్టు దెల్ప,

గీ. పతిప్రవాసంబు పేర నీపట్టినట్టి
వ్రతము నీమేనిసొంపు తార్మాఱుచేసి;
కటకటా! పాపినైన నాకన్ను పొడిచి
చెట్టనగు నామనంబునఁ జిచ్చు వెట్టె.

దేవి ! క్రూరాత్ముఁడను. వంచకుఁడను. నీమొగము చూడఁజాలకున్నాను. (విషాదము)

ప:—(దుఃఖముతో) అది నాపాపము గాని మీదోషము కాదు. ధీర హృదయులు విచారింతురా ?

వి:—[మీఁదు చూచుచు] ఘోరము—ఘోరాతిఘోరము !

గీ. దుర్గమాద్రికి నన్నట్లు త్రోసినావు
దేవి నిట్లు తపస్యకు దింపినావు
శ్రీనివాసంబు సొంపు హరించినావు
దైవమా ! నీమహత్త్వంబు దారుణంబు.

(క్రిందు చూచుచు) సాధ్వీమణీ ! నిన్ను చూడలేకున్నాను.

ప:—[డగ్గుత్తికగా] పదునాలుగేళ్ళనుండి మహారాజా !

వి:—ప్రాణేశ్వరీ ! చంపకు. అది గాదు, ఈవేషము చూడలేకున్నాను.

ప:—[గద్గదస్వరముతో] ఔను. వేశ్యావేషమువలె నిల్లాలివేష మింపగునా ?

వి: [కన్నులు మూసికొని చేతులు జోడించి] జీవితేశ్వరీ ! నాపరమ రహస్యము కనిపెట్టిననీపాతివ్రత్యమహిమకు నమస్కారము— కాని యిది మునుపటి యిల్లాలివేషము కాదు.

ప:—అయ్యో ! నే నేమిచేయుదును ? ఇది మీ రిచ్చినవేషమే కాని నేను కోరుకొని తెచ్చుకొన్నది కాదు.

వి:—క్షమించు దేవీ ! క్షమించు—నీధర్మాచరణము జగదేకవంద్యము. నీచెంత చేరితిని గదా! ఇఁక నెందుకు? ఇది మార్చి వెనుకటి రూపముతో దర్శన మిమ్ము ధన్యుఁడ నయ్యెద.

ప:— (సవిషాదముగా) ప్రాణనాథా! అది భ్రాంతి గాని మార్చితే మాత్ర మింతలోనే రంభ నగుదునా? ఊర్వశి నగుదునా? ఆయపూర్వలావణ్యమున కీరూపము వచ్చునా?

వి:— హాహా! నాగుట్టంతా బట్టబయ లైనది— దేవీ! క్షమించు. ప్రాణేశ్వరీ! రక్షించు!

ప:—(విషాదముతో, ఎక్కడిప్రాణేశ్వరః? అనురాగస్థానము సౌశీల్యమో సౌందర్యమో, ఆర్యపుత్త్రినిహృదయమే యెఱుఁగును.

వి:— హా సతీ! చచ్చితిని. అజ్ఞానిని (విషాదము) నీ వేమ్చుచు వన్నె డ్పించు చున్నావు.

ప:—(దుఃఖముతో) సత్యము_ తెగించి దేహము విడువక మీా కిట్టియుప చార మొనరించితిని. క్షమించండి_

వి:— ఛీ విశ్రిత్తా! నీ కీక త్తిపోటు చాలదా? (నిశ్వసించి) దేవీ!

ఆ. నగము చచ్చి వచ్చి శర ణన్నవాఁడను
కనికరించి నన్నుఁ గావఁ దగును.

(క్రిందు చూచుచు నంజలి ఘటించి యుండును)

ప:: —(దుఃఖము పొంగి పొరల)

ఆ. అప్సరోఽద్రిమీాద సర్ధాంగ ముండుట
కతన నీసగంబు గాసిఁ జెందె.

(అని విలపించుచు)

వి:—ప్రాణేశ్వరీ ! దాసుఁడను శరణార్థిని, అపరాధిని (కాళ్ళు పట్టుకొని) యాదవసామ్రాజ్యధురీణవు. తగినశిక్ష విధించి యీపాపిని పునీతుని గావింపుము.

ప:—(లేవనెత్తి) ఆర్యపుత్రా ! నాకు పరముకూడా లేకుండఁ జేయుదురా ? నిజము పలికియు భర్తమనసు నొప్పింపరా దని యెఱుఁగుదును. దుఃఖావేశమున నే మంటినో ! నాథా ! నమస్కారము క్షమింపుఁడు. (పాదము లంటి మ్రొక్కును)

వి:—ప్రేయసీ ! నీమనసు నొప్పించినవాఁడను నేను. తప్పునాది_

ప:—అది కామదోషము గాని మీాదోషము కాదు. దాని ప్రభావ మచింత్యము విచిత్రము_

ప: —ఇది కులదేవతవాక్కు. దేవీ ! సత్యము సత్యము.

ప:—కర్మవశమున మీకామము గృహస్థవిధుల నతిక్రమించినది. ధర్మరహితమైన కామము నరకహేతు వందురు. (విచారముతో) ఏమి చేయఁదగునో తోఁచకున్నది.

వి:—సంశయ మేమి? పాతివ్రత్యమూర్తివి తపస్వినివి, తగిన ప్రాయశ్చిత్తము విధింపుము.

ప:—(సవినయముగా) ఆర్యపుత్రా! ఆయధికారము కులగురువులకు మాత్రమే కలదు.

వి:—[జంకి] అయ్యో! ఆమహర్షి మొగము చూడఁగలనా?

ప:—[తల వంచి] గత్యంతరము కనఁబడదు. వంశాచార మతిక్రమింపరాదుగదా!

వి:—కాని! మహారాజ్ఞివి. నీశాసన మనుల్లంఘనీయము.

ప:—ఆర్యపుత్రా! అట్లనరాదు, మహాత్ములధర్మశాసనమునకు లోకమంతయు కట్టుపడవలసినదే. మీరు లోకశాసకులుకదా!

వి:—సరే! కణ్వమహర్షిని సందర్శింతును.

ప:—[సంతోషముతో] మీహృదయపరివర్తనమున కానందించితిని. [చేతులు పట్టుకొని] నమస్కారము. నాదుఃఖాలాపము క్షమింపుఁడు.

[తెరవాలును]

—o—

# విక్రమోర్వశీయము

## అష్టమ రంగము—హిమాలయమార్గము

—• పాదచారి యగు విక్రముఁడు ప్రవేశించును •—

(మోమెత్తిచూచి) దేవీ! కులగురుఁడయాచతిరి ప్రాయశ్చిత్తవిధికి పోవుచున్నాను. ఇది విన్నచో నీవు సంతాపింతువో సంతోషింతువో! అమృతకుండమున స్నానము చేయుచు దినమున కొక్క వేలచొప్పున పన్నెండురోజులు గాయత్రీమంత్రము జపించుమని యాదేశించిరి. నాలుగుదినములు పర్ణభక్షణము నాలుగునాళ్లు నీరుభక్షణము కడపటినాలుగువాసరములు వాయుభక్షణము విధించిరి. ఇందుకు విచారము లేదు గాని భూమిపై కాలినడకను పొమ్మని సెల విచ్చిరి గదా! నావియద్గమనశక్తి నెఱింగి విధించినశిక్షయిది—అబ్బా! ఎక్కడికణ్వాశ్రమము? ఎక్కడిహిమాలయగర్భము? శ్రీహరీ!! చేసినకర్మ మనుభవింపక తీరునా?—ఇంకా రెండామడ యున్నదట! (నడచుచు వింతగా ముందు చూచి) ఎక్కడిదీయపూర్వసుగంధము? హాయి హాయి! (ప్రక్కకు చూచి) ఆవచ్చువానివద్ద నేమేని సుగంధద్రవ్య మున్నదేమో! (ఆఘ్రాణించి) ఏమి సువాసన? (అటు చూచి యాగి) ఆతఁడు చేరుచున్నకొలఁదిని సురభిగంధము హెచ్చగుచున్నది— (తేఱి చూచి) ఆ! రానీ! అతనిమెడలోనిది పూలదండ కాదా! ఆ! పుష్పహారమే. మగవాఁడు వీని కెందుకు? అది యూర్వశిమెడలో నుండఁ దగినది. (కొంచె ముందరేగి) దీని నెట్లయినా పుచ్చుకొని చుట్టుదారి యైనా సరే దాని కిచ్చి వచ్చెదను.

[పుష్పహారధారి యగు పురుషుఁడు ప్రవేశించును]

వి:— (సమీపించి) ఎవ రండీ మీరు?

పు:— గంధర్వులము?

వి:— మీ పేరు?

పు:— విశ్వావసువు—మీ రెవరు?

వి:— క్షత్రియులము—ఈసురభికుసుమమాల యెక్కడిది?

పు:— నాకలోకమునుండి తెచ్చుకొన్నది.

వి:— అంతే యనుకొన్నాను—ఇవి మీ కచ్చట సులభములు (చిఱునవ్వుతో) దండ బాగున్న దండీ! మీరు నాకమునకు తఱచుగా పోవు చుందురుగదా!

పు:— ఆఁ! (నడచుచుండును)

వి:— చిన్నమాట

పు:— ఏమిటి చెప్పండి. (ఆఁగును)

వి:— ఈదండ నా కిత్తురా?... ... ...

పు:— (తీవ్రముగా) ఇవ్వ నివ్వను (పోఁబోవును)

వి:— కొంచె మాఁగండి— మనసుపడి కోరుచున్నాను—

పు:— నా మెడలోనిదండ యి మ్మందువు, అ దేమికోరి కయ్యా!

వి:— అయితే సరే! కోరిక కాదు, శాసనమే—

పు:— (కోపముతో) నన్ను శాసించుటకు నీ వెవఁడవు? వెళ్ళు వెళ్ళు (నడవఁబోవును)

వి:— ఆఁగు మని చెప్ప లేదా? ఆఁగు—

పు:— (ఆఁగి తీవ్రముగా) ఏమి టీయాజ్ఞ? దార్లు కొట్టువాఁడవా?

వి: జాగ్రత్తగా మాటాడు.

పు:— అరే! ఏమి టీబెదరింపు? చిత్రముగా నున్న దే!

వి:— ఇది రాజాజ్ఞ. ఇచ్చి కదలు. లేకున్న ... ...

పు:—[అపహాసముతో] బళీ! పాకము ముదురుచున్నదే! నీకత్తియక్కడ పెట్టుము. ఇది గంధర్వవీరాజ్ఞ!

వి:—[నవ్వుచు] సెబాసు గంధర్వా! మంచిమాటన్నావు. కత్తిలేని వానితో నేను ఖడ్గము పట్టి పోరాడను. నాకత్తి యాబండపైఁ బెట్టెదను. నీవుంకూడా అక్కడ పెట్టుము ఈ రెండును గెలిచినవారివి. బాహుయుద్ధ మొనరింతము సరేనా?

పు:—ఓ! కానీ! ఆగర్వ మణఁగుట మంచిదే! [అట్లు చేసి, పైవస్త్రములు తీసి యంచుంచి కొంతసేపు బాహాబాహిగా పోరాడుదురు.

వి:—(చేతులుపట్టి ముందుకు లాగి, యొక్కగొట్టి గెంటి)
గర్వ మణఁగిన దోడే? గంధర్వవీర!

పు:—(వెలికిలఁబడి లేచి, ఒళ్ళు దులుపుకొనుచు)
ఎగురఁబోకుము చూడు నీపొగ రణంతు (అనుచు డాయును)

[తెరలో]

వద్దు వద్దు వెళ్ళకు కలియఁబడకు ఆఁగు.

వి:—(అటు చూచి, అయ్యో పాపము! ఆఁడది పరుగెత్తుకొని వచ్చుచున్నది.

పు:—(సిగ్గుతో తల వంచును)

ఆ: (ప్రవేశించి, ఏమి టిది? ఇంతలోనే... (గంధర్వుని కడ్డముగా నిలచి వగర్చుచు రాజును జూచి) ఎవరు విక్రమమహారాజా? ఔరా! ఎంత ప్రమాదము... ...?

వి:— భయములేదు. తత్తరపడకు—న న్నెట్లెఱుఁగుదువు ?

ఆ: — (చిఱునవ్వుతో) పదునాలుగేండ్లక్రిందట యమునాతీరమున చూచినాను.

వి:— (ఆశ్చర్యపడి దరస్మితముగా) సరే సరే! తెలిసినది. ఇందురేఖా! నాఁడు కనఁబడకపోయినా, నేఁడు కనఁబడక తప్పినది కాదు. పూర్వస్నేహితురాలవు, సంతోషము—

ఇం:- - నేఁడు సుదినము ధన్యురాలను.

వి:— రెండుమూఁడుసార్లు నీపరిసంగము వచ్చినది. నీమంచితనము నా మనస్సు నంటియున్నది.

ఇం:- – ఇది మాయవ్యాజకరుణ కుదాహరణము.

పు:— . (విసుగుతో) ఈయుద్ధ మేమిటి? ఆమాట లేమిటి?

ఇం:- -ఏమి తొందర? పెద్దమనుష్యులతో మాటలాడుచుండఁగా ...

పు:— . అవు నవును. కానివా రెవరు? ఉండు. ఒ క్షిగిలు ... ...

ఇం:- - ఏ మనుకొన్నావో? హనుమంతునిముందజునా కుప్పిగంతులు!

పు:— . అయితే కానీ! బదులు తీర్చుచుండఁగా విడువను—

ఇందురేఖా! నీమొగము చూచి సంశయించుచున్నాను.

పు: . ఈయుద్ధమే లేకపోతే ఆ సంశయమే పుట్టకుండును (మీసము దువ్వును)

వి:- (చిఱునవ్వున నిరసనము చూపును)

ఇం:— అయినపరాభవము చాలదా? నీబడాయి యిక్కడ పనికిరాదు. ఈయనపరాక్రమము విన్నావా కన్నావా?

గీ. గాండ్రు గాండ్రు మటంచు వ్యాఘ్రంబు బోకండు
పైకి వచ్చుట గని తడఁబడక యితఁడు
చేర రానిచ్చి బలుతరవారి నేసె
నొక్కవేటున నది రెండుముక్క లయ్యె.

పు:- - అబ్బో! గొప్పపరాక్రమమే.

ఇం: -[నవ్వుచు]కాదా! అదే నీవైతే, కామరూపముతో కాలికి బుద్ధి చెప్పియుందువు— తెలిసినదా! అస లీపోరాట మెందుకు తెచ్చిపెట్టినావు? ఆబుజముమీఁదిదుమ్ము దులుపుకో!...

పు:- -[కోరచూపుతో]ఆయన తెచ్చిపెట్టినదే ...

ం:— ఎందుకోసము?

పు:— —ఆఁ! మరాళ. పూలమాలికకోసము.

ఇం: —అదేది?

పు: అదిగో రాతిమీఁద...

ఇం:— తెచ్చి యిచ్చివేయుము...

పు:— [మొగము చిట్లించుకొని] నే నెందు కివ్వవలెను?

వి: — [చిఱునవ్వుతో] గెలిచినవారు తీసికొనడమే న్యాయము.

పు:— [ఆఁకోఁజి లాఁగుచుచూచి] ఈయువ్వు లేకపోతే గెలు పెవరిదో తెలిసివచ్చును. (తనవస్తువులు తీసికొని వెడలిపోవుచు) అది నీదే కదా! నీయిష్టము వచ్చినట్లు చేసుకో (నిష్క్రమించును)

ఇం:— (అటు చూచి) మరభిమానమంతే ఇదే! (పూలదండ తెచ్చి రాజుమెడలో వేసి నమస్కరించి) అతఁడు తెలియక చేసినయపరాధము క్షమించండి.

వి:— అతనితప్పేమీ లేదు—ఇది నాతప్పును గాదు—ఇంతకును నీ సౌశీల్యము మేలు చేసినది. ఇట్టియవ్యాజమైత్రి లోకములో దుర్లభము. ఇది మఱచిపోను.

ఇం:— మహానుగ్రహము, ధన్యురాలను—అయితే మహారాజా! ఇప్పుడెక్కడి నుండి దయచేయుచున్నారు?

వి: —యదుపురమునుండి—

ఇం:— అల్లాగా? అంతఃపురము చిత్తగించి వచ్చుచున్నారా? పరమానందము—ఈప్రియురాలింకా, అచ్చరకొండకు వచ్చి యుండదనుకొని యీదారిపట్టినారా? పోనిండు. ఈవిధముగా పునర్దర్శనమైనది.

వి:— కాదు సఖీ! (దరహాసము) మఱియొకపనిమీఁద నిటు వచ్చుచున్నాను.

ఇం: —(అచ్చెరువడి) ఏమిటీ! మేరుగిరికేమో, శ్రమపడ నక్కఱలే దని చెప్పవలె ననుకొనుచున్నాను—వింత లేమీ లేవు గదా?

—(నవ్వుచు) ఉండే నీకు తెలియవా?

ఇం:—అయితే, ఎక్కడి కీప్రయాణము?

వి:—అమృతకుండమునకు—

ఇం:—ఇం కేమి? దాపఱికె మెందు కండీ?

వి:—(చిఱునవ్వుతో) నీ వేదో పొరపడుచున్నావు —

ఇం: అయితే క్షమించండి. కారణ మేదేని కానిండు. అదృష్టవంతు లెక్కడికి వెళ్ళినా, అదృష్టవంతులే.

వి:—(సస్మితముగా) అదేమిచెలీ! అట్లనుచున్నావు!

ఇం:—(దరహాసముతో) తీర్థము స్వార్థము కూడివచ్చిన వని—

వి:—(నవ్వి) నీవుకూడా నర్మసంభాషణము నేర్చినావా?

ఇం:—[హస్తము స్పృశించి] ఎంతమాత్ర మది కాదు. ఊర్వశి మేరుగిరినుండి వచ్చి యమృతకుండముచెంత విడిసియున్న దని చెప్పుట కట్లంటిని.

వి: [వికారముతోఁ దనీక] ఓ! అల్లాగా? మంచిదే—ఇం కేమైనా విశేషములు?

ఇం:—ఏ మున్నవి? మహారాజా! నే నింకఁ బోవలెను. అతఁడు త్వరపడుచుండును — ముఖ్యమైనమాట యొకటి — ఈపుష్పహారమష్టాబ్దసురభిమాల్యము దీనిమహిమ వినుఁడు.

క. యౌవనము నిల్పుఁ, బోయిన
యౌవనమును మఱల దెచ్చు, నతిదుర్లభ మీ
పూవులదండ, సుగంధం
బీవిధముగ నుండు నెనిమిదేడులదాఁకన్.

ఇఁక దీని నెట్లుపయోగించుకొందురో! మీచిత్తము.

(రాజుచేతులు కన్నుల కద్దుకొని) సెలవు సెలవు—(నిష్క్రమించును)

వి:—(పరిక్రమించుచు) ఔరా! నాజీవిత మెంత వింతగా నున్నది? తలఁచుకొన్న నాకే నవ్వు వచ్చుచున్నది. నేను పోవుచున్నపని

యేమి? ఈమాల్యదర్శన మేమి? ఊర్వశీస్మరణ మేమి? ఆహా! దైవమా! మరల నీయాట నీవు మొదలుపెట్టినావా! నిన్ను తప్పించుకొని తిరుగువాఁడు పృథివిలో నుండఁబోఁడు. నేను నీ చేతికీలుబొమ్మ నైనాను. (దుస్తులుతాల్చి కత్తి గైకొని నడచుచు) చారులవల్ల నాజాడ తెలుసుకొని యిది యిక్కడికి వచ్చియుండును. (ఆలోచించి) ఎట్లయినా చూడఁదలఁచినమాట నిజము. చుట్టఁదారి తప్పినమాట సత్యము. అయితే ప్రాయశ్చిత్తవిధి మాట? (ఊహించి) దీనిమాట యటుంచు. ఇందుకు వచ్చితా నని తెలిసినచో నిది విధించుప్రాయశ్చిత్త మేమో! ఛీ! (సంకోచించి) ఎటు చూచినా చిక్కుగానే యున్నది. ముగ్గురు ముగ్గురే! దైవము చలపట్టి నన్ను పరీక్షించు చున్నది. ఆహా!

గీ. ఆశ తప్పితి వని వేశ్య యాడిపోయు,
సతి మాలితి వని రాణి నిందసేయు,
ఆజ్ఞ మీఱితి వని గురు వాగ్రహించు,
ఏల కనిపించెనో పాడు పూలదండ?

[ఆఁ తలవంచి యాలోచించి, నిశ్వసించి] ఎందు కింక! ముందుకు పోతే ఇహ మైనా యున్నది. వెనుకకు పోతే యిహపరములు రెండును లేవు. (పరిక్రమించుచు నులికిపడి) ఇంతకు గడువు దాఁటలేదుగదా! (రోజులు లెక్కించి) ఆఁ! దాఁటలేదు. పోనీ! ఇది కీడులో మేలు. (రెండడుగులు వేసి యాఁగి శూన్యదృష్టియై తలంచి) అరే, పొరపాటు! ఈపూలదండ కనఁబడకపోయినా, అమృతకుండముదగ్గఱ నూర్వశీదర్శనము సిద్ధమే—ఆహా దైవగతి! అటు గురువాక్యము, ఇటు వేశ్యాసమయము. ముందు నుయ్యి వెనుక గొయ్యి. కర్మ మెట్లున్నదో? నాబ్రదు కేమికానున్నదో? కానీ!! గురువర్యా! నమస్కారము. [నిష్క్రమించును]

—o—

# శతోర్వశీయము

## నవమ రంగము—అమృతకుండము చెంతరాతిమిద్దె

[వీథియరుగుమీఁదఁ గూర్చుండి మాట్లాడుకొనుచు
నూర్వశీవిశ్రుతులు ప్రవేశింతురు]

ఊ:— మనోహరా! ఈపదిదినములనుండి యెన్నోవిధముల బ్రతిమాలుచున్నను నామాట వినకున్నారు. అది ధర్మముకాదు సుమండీ!

వి:— ప్రేయసీ! ఆగొడవ యింకఁ దేవద్దని కోరినా మరల నదే తెచ్చుట నీకును దగదు సుమీ!

ఊ:— మాటకు మా టంటే సరా? ఇది యంత తేలికగొడవ కాదు.

వి: కాకేమి? గోరంతలు కొండంతలు చేయుచున్నావు కాని...

ఊ:— ఔను గాని, ఇందురేఖయభిప్రాయమునుబట్టి మీపట్టమహిషి కివ్వవలసినపుష్పమాల నా కిచ్చుట తగునా?

వి:— అది నీకోసము సంపాదించితి నని చెప్పలేదా? మఱెందు కా ప్రశ్న? (లేచును)

ఊ:— బాగున్నది. (లేచి) మీయనుగ్రహమున కానందించితిని. కాని నా కిట్టిదండలు లేవా! రావా! ఆమహాపతివ్రత కాదండను నా కానుక గా సమర్పింపుఁడు.

వి:— చిత్తము. ఆజ్ఞ నెఱవేర్పక తప్పునా?

ఊ:— (నవ్వుచు) అంతయెకసక్కె మెందుకు?...సరే కాని, నిజము చెప్పండి మళ్ళీ అడుగుచున్నా ననుకోక. గడువులోపల రావలె నని నాకోసమే వచ్చినారా?

వి:— అబ్బా!!

ఊ:— ముచ్చటగా నడుగుచుండ నంతవిసుగెందు కండీ!

వి:— నీకొఱకు రాకపోయినా నీకొఱకు వచ్చినట్లే యైనది. ఆమాట ముమ్మాఱు చెప్పితిని. ఇంకా యెందు కీపరీక్ష?

ఊ:— ఎందుకో వినండి. త్రికరణశుద్ధిగా శ్రీహరిసాక్షిగా మనవి చేయుచున్నాను. మీదేవిమాటలు మీకులదేవతమాటలు మీకులగురునియాజ్ఞ. పరమేశ్వరునియాజ్ఞ, ఆమాటలు తలఁచుకొంటే యొడలు వణకుచున్నవి! ఇప్పుడైనా నాకోరిక మన్నింపుఁడని చేతులు పట్టుకొని వేఁడుచున్నాను.

వి:— (విశీపించుకొని) ఎన్నాళ్ళీమాటలు? భయపడవలసినది నేనా నీవా? ఏమి టీనిర్బంధము? (పెడమొగము పెట్టును)

ఊ:— (దోసిలి యొగ్గి) రాజేంద్రా!

చ. వనితలమాట లన్న మగవారికిఁ జుల్కన గాక, రాజ్యవ
ర్తన దలపోయ కిట్టిహపరంబులకుం జెడు టర్హమౌనె? నా
మనవి తిరస్కరింతురె? సమస్త మెఱింగినమీకు నేను జె
ప్పనె? యిప్పుడైన నన్విడిచి పట్టపురాణిసుఖంబు చూడుఁడీ!

వి:— నీవు చిత్తశుద్ధిగాఁ జెప్పుచున్నావని నమ్మెదను గాని తెలిసినవాని కిన్నిసార్లు తెలుపవలెనా?

ఉ. నీపను పేరొనర్ప నని నేరము మోపకు, పాడుదైవమే
పాపపువేళ నీకరము పట్టఁగఁ జేసెనొ? నిన్నుఁ గన్ననా
చూపున కింక వేఱొకతెసొంపు రుచింపక యుండె, నామదిన్
దాఁపఱికంబు లే దిది యథార్థము, నాసుఖ మీవు చూడుమీ!

ఊ:— [చిరాకుతో] వద్దు వద్దు. మీయెడఁబాటున కోర్వఁ జాల నని తలఁచి కదా తొలుత మీచే సమయము చేయించితిని! అట్టి నేనే యెందు కింత బలవంతపెట్టుచున్నానో కొంచె మాలోచించండి.

వి:— (సాక్షేపముగాఁ జూచి) కొంచెము కాదు చాలా ఆలోచించినాను. నానిశ్చయము చెప్పుచున్నాను విను.

ఉ. ఆనతి మీఱినాఁడ వని యమ్ముని తీవ్రముగా శపించనీ!
మానము లేనివాఁడ వని మానిని ఛీ యని నింద సేయనీ!
పూని యొనర్చు కామువిధి పూర్తిగ దుర్గతిఁ గూలఁద్రోయనీ!
యే నిఁక నిన్ను వీడి పురి కేగఁగఁ జాలను దివ్యకామినీ!

ఊ:—(మొగము చిట్లించుకొని పెడమొగముపెట్టి తనలో) ఇది కేవలము రూపమోహ మని యెఱుఁగుదును. ఈకనువేఁదు అణఁగి పోవుచికిత్సయే యిపుడు కర్తవ్యము. అది ముందు కొంతసూచించుట యెందు కైన మంచిది. [ప్రకాశముగా, కోపముతో] నీవు నారూపమును మోహించినట్లే నేను నీరూపమును మోహించితిని. నిజ మింతే కదా! అట్టియెడ నే నావాంఛ వదలుకొనుచుండ నీ వెందుకు వదలుకోలేవు? నీ కేమగుదు పుత్త్రులఁ గన్నప్రియురాల నింత నిర్బంధించి యెందుకుఁ జెప్పుచున్నానో వివేకించుకో! అగ్నిసాక్షిగాఁ బెండ్లాడినయా సతీమణి ధర్మచింత యెట్టిదో స్మరించుకో! తనువులే శాశ్వతములు కావు. ఇకరూప యౌవనములు శాశ్వతములా? ఇప్పటికే నీయర్ధాంగిజవ్వన మడవిని గాచినవెన్నెల యైనది. ఆపాతకము నీతో సమానముగాఁ బంచుకొనుచున్నామనవి చిత్తగించి యిపుడైనా నీగురునియానతి నడపి పురంబునకుఁబొమ్ము.

[అని చెరచెర లోపలికిఁ బోవును]

వి:—(నిశ్చేష్టుఁడై చూచి) ఏమి టీఘోరణి? నీవు నీ వనుచు నిశ్శంకముగా నిట్లు తూలనాడుట చూడ దీనిమనసు విఱిగినట్లు స్పష్టమైనది. [నిశ్వసించి పరిక్రమించుచు] ఇది ప్రేమ లేనికోపమా? కాదు. వారు శపింతు రన్నభయము ... [ఊహించి] నిజమే, రూపమోహమే. కా దేని, యేదోష మెఱుఁగనికన్యారత్న మని దీనిని వరించితినా? అది కన్ను చేసినతప్పు. మనస్సు నంపూరు

గాని కన్ను మూచెడ్డది. ఆరూపము మనస్సున కింత
ముగా నంటుటకుఁ గన్నే కదా కారణము! ఇపు డేమి చేయను?
దీనికి నీతులు పని చేయునా? జపతపములు పనిచేయునా? ఇప్పుడు
కన్నులు పోయినా నన్నీరూపమోహపిశాచము వదలదు...
దీని నావహింపఁజేసినదైవమే దీనిని వదల్పవలెను. అంతవఱ
కీబ్రతు కింతే. లేకపోతే, పూలదండ కనఁబడినంతనే యిదే
స్మృతికి రావలెనా?... ...[తలంచి] ఆహా!

ఉ. మానము మంటలోఁ గలసె మంత్రిమొగంబును జూచువేళ, నా
ప్రాణము పోయినంతపని యయ్యె సతీమణిఁ గాంచువేళ, దాం
గైనను మేలు నాఁగ భయ మయ్యె మహర్షిని జేరువేళ, న
న్నైనను వీడకుండె నపురా! కనువేఁదు, ఇ దెట్టిమోహమో ! !

[తల యాడించుచు నాశ్చర్యవిషాదములు దోఁప]

క. పో పొమ్మని తెగనాడిన
నీపాపపురూపమోహ మెడఁబాయ, దిసీ!
భూపతి ననునభిమానము
కోపంబును గామచింతకుఁ బలి యయ్యెన్.

(ఇట్టటు పరిక్రమించి తల యూఁచి) కానీ! నేఁటితో నేనో యొకటి
తేలు నని పొడగట్టుచున్నది, చూతము. (ద్వారమువంక చూచి
చాలసేపైనది లోపలికి వెళ్ళి... ...ఏమి చేయుచున్నదో? ..
రుచిమతీ!

[తెరలో విసుగుతో] ఏమండీ ?

వి: పేయసి యెక్కడ ?

[తెరలో] మీ దెవము నడగండి.

వి:— (తెల్లఁబోయి) ఇదేమిటిరా! దీనిధోరణి కూడా మాఱినది ?
ఇదేదో వింతగానే యున్నది. అవస్థ మాఱేరోజు వచ్చినది.

సం దేహము లేదు, ... ...పోయి చూతునా? (రెం డడుగులు వేసి) అక్కడిగొడవ యేమిటో! (ఆఁగి) రుచిమతీ! ఏమిటి సంగతి? నేను వత్తునా?

[తెరలో] రా నక్కఱ లేదు. అక్కడుంటే వచ్చినంతసంతోషము

వి:—సరే తెలిసిపోయినది. ఇదేదో కుతంత్రమే. రూపయావనములను గూర్చి యుపన్యసించి వెళ్లినది... ...ఏదో మోసము తలపెట్టి నది. (స్మరించి) ఆఁ! అచ్చరలకుఁ దెలియనిమాయ లున్నవా? కామరూపకామగమనము లెఱిఁగినది మోసగించలేదా? సరే కానీ, ఏమయినా మంచిదే... ...

[తెరలో] ఇ దేమిటమ్మా! పిడుగు పట్టట్టు వచ్చి పడ్డది. అయ్యో! ఎల్లాగంటిరూప మెట్లు మాఱిపోయినది? లేవడ మెందుకు? సరేలే! ఈకఱ్ఱ పట్టుకో! (మూఁడుకాళ్ళముదుసలియగునూర్వశియు రుచిమతియు నొకవంక ప్రవేశింతురు)

వి:—(తీవ్ర దృష్టితో) ఈమూఁతముప్పిడి యేమిటి? వెళ్ళి చూచెద. (పరిక్రమించి యటుచూచి) అబ్బా!! (మొగము త్రిప్పుకొని ఏ మిటిది రుచిమతీ నిజము చెప్పు.

ఊ: (పెదవులు దవుడలు నాడుచుండ శిరఃకంప మభినయించును)

రు:— ఏ మున్నది? కనఁబడడము లేదా?

వి:— మాట్లాడుచుండఁగానే ముసలితనము పైఁబడె నందువా?

రు:— నాటకములో వేషము వేసిన దండీ!

వి:— ఏమి యావిసుగు? తిన్నగాఁ జెప్పలేవా?

రు:— మీచెట్టు పట్టినందుకు ఫలమిది ...

ఊ:— (కొంచెము ముందుకు వంగి వణఁకుచు) మనోహరా!

వి:— (మొగము ముడుఁచుకొనును)

ఊ:— ఈవింతరూపము దైవమాయచే వచ్చినది. దైవము నేమం దును? నాపాప మది. నీ వనుమానింతు వని విచారింపనా? నా

దురవస్థకు దుఃఖింపనా? హా దైవమా!

గీ. కాలకర్మవశంబునఁ గాన నైతి,
మానవుని గూడి ముదుసలిదాన నైతి,
రూపసంపద వలచి కురూప నైతి,
నచ్చరలలోన నగుఁబాట్ల కగ్గ మైతి.

అక్రూర దైవము మనకూటమి సహింపలేదు. నే నేమి చేతును?

గీ. నిర్జరాంగన నైననా నెత్తి యెక్కి
యాజరాదేవి తాండవం బాడఁజొచ్చె
పాపవశమున నెడఁబాటు దాఁపరించె
భూవరా! వందనంబింకఁ బోయి వత్తు.

(రుచిమతితో యవనికాన్తరితయై నిష్క్రమించును)

పి:— నిజముగా నూర్వశియే (తల దులుపుకొని) అబ్బా! పీడ వదలి పోయినది. చక్కని యెత్తు వేసినది మంచిమంత్రికత్తె. చిట్టికలో నాపిశాచబాధ వదల్చినది. ఏ దేవో కుతంత్రము పన్నుచున్న దనుకొన్నాను. ఎంతమాయలాడి? (నవ్వుకొని) పాప మంట దైవ మట!! దొంగవేషము. పతివ్రతాశిరోమణి పట్టను హిమషి శపించు నని భయపడినది. నాగుట్టెఱుఁగునుగావున దానికిదేమం దనుకొన్నది...ఛీ! తలఁచుకొంటే శోకు వచ్చుచున్నది. [ఒళ్లు పులకింప] రోఁత రోఁత. అపు డారూపము నామతి చెఱచినది. ఇపు డీరూపము నామతి విఱచినది. సెబాసు! ఏదయినా దైవమే చేయవలెను. ఇంక నిది నిజరూపముతోఁ గనఁబడినా యీరూపమే తలఁపునకు వచ్చునట్లు చేసినది... నాకై తెచ్చుకొన్నవార్ధక మైనా కొంతసేపు దానిఫల మనుభవించినది. అంతే చాలు...ఇది సదుద్దేశముతో నామేలును నారాణిమేలును గోరిన దైతే, ఇంతకు ముందీవేష మెందుకు

వేయలేను? ఇపు డాదేవిపాతివ్రత్యమహత్త్వము విన్నది, ఈ కురూపము తెచ్చుకొన్నది. అంతే. లేకున్న వేశ్య యెక్కడ? పరార్థచింత యెక్కడ? ...అయితే నేమి లే! నిర్జరాంగన నన్ను గర్వ మొక్కనిమిష మణఁగిగా యణఁగడమే.

సీ. అలినీలవేణి నన్నన్నమాటలు విని
దీపించుకురు లెల్ల తెల్లఁబోయె,
పర్వేందుముఖి నన్నుఁ బాయుట కని పెట్టి
మోము సంకోచించి మూతి ముడిఁచె,
ఇందీవరాక్షి నాపొందు వీడుట గాంచి
బెంగతోఁ గనుదోయి క్రుంగిపోయె,
కనకాంగి నామాట వినలే దటంచు వం
దురి యంగములు వంగి తిరుగకుండె,
గీ. అనఁగ వార్థక మిమ్మాయలాడిరూపు
పో నణఁచి నాకుఁ దగినట్లు బుద్ధిచెప్పె,
[చేదోయి ఫాలమున ఘటించి]
దీనితో రూపమోహంబు తీరి పోయె
దైవమా! చాలు వారకాంతాసుఖంబు.

[పరిక్రమించుచు] సర్వముదైవాధీనము. నన్ను దారితప్పించిన దైవమే నేటికి మరల దారికిదెచ్చినది (సంతోషముతో). ఇంకఁ బుసి తుఁడ నగుటయే తరువాయి, (ఆఁగి) ఔను గాని, కులగురువు లప్పటికిఁ జేసినపాపమునకుఁ బ్రాయశ్చిత్తము విధించిరి గాని మరలఁ జేసినపాపముమాట యేమి? ఈదోష మాపతివ్రతా శిరోమణి కనిపెట్టదా? ఆమహర్షికిఁ దెలియదా? [ఆలోచించి] దీనికై మరల నమృతకుండమునకు రానేల? గాయత్రీజపము కోట్లింపు గావింతును. అది తెలిసి వా రేమందురో! తరువాతఁ

తము [క్రిందు చూచుచు దోసిలి యొగ్గి]

సీ. క్రత్వామహాక్షేయాజ్ఞను మనంబున నెంచి
యమృతకుండస్నాన మాచరించి,
ఆహారనియమ మింతైనఁ దప్పక మహా
భక్తి గాయత్రీజపం బొనర్చి,
రాజధానికి నేగి రాణిపతివ్రత
కష్టాబ్దసురభిమాల్యం బొసంగి,
మరలఁ జేసినతప్పు మఱియుఁ జేసినజపం
బెఱిఁగించి యాదేవికృప గడించి,
గీ. సకలజనరంజనంబుగ సత్యధర్మ
పరుఁడనై యిఁక యమరాజ్యపాలనంబు
నాచరించెద నిందిరాప్రాణనాథ!
శ్రీహరీ! దేవదేవ! రక్షింపుమయ్యా!
(అని నమస్కరించి పరిక్రమించుచు)

— భ ర త వా క్య ము —

గీ. ఖ్యాతవృత్తంబు మర్త్యదివ్యాంచితంబు
వీరకరుణాద్భుతాంగ శృంగారితంబు
రంగరమ్యంబు బుధజనరంజనంబు
విక్రమోర్వశీయము భువి వెలయుఁ గాక
[అని నిష్క్రమించును]

ఇది మల్లాది సూర్యనారాయణశాస్త్రి
ప్రణీతమైన విక్రమోర్వశీయమున
న వ మ రం గ ము.

శ్రీ చింతామణి ప్రెస్, రాజమండ్రి.

# శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి

# గ్రంథములు

* ఇప్పుడు లభించునవి *

| | |
|---|---|
| మహావీరచరిత్ర నాటకము | 2—4—0 |
| ఉత్తరరామచరిత్ర | 1—0—0 |
| భాసనాటకకథలు—ప్రథమభాగము | 1—4—0 |
| ,, ద్వితీయభాగము | 0—12—0 |
| ప్రేమతత్త్వము | 0—8—0 |
| ఆంధ్రభవిష్యపర్వము | 1—8—0 |
| ఆంధ్రభాషానుశాసనము | 1—8—0 |
| ఆంధ్ర దశరూపకము | 1—0—0 |

సంస్కృత వాఙ్మయచరిత్ర—ద్వితీయముద్రణముకానవలెను—

సంస్కృత కవిజీవితము—అచ్చులో నున్నది—

దొరకు చోటు

## రౌతుబుక్కుడిపో

రాజమహేంద్రవరము

—o—